నమః పరమర్షిభ్యః.

# ఆంధ్రోపనిషత్తులు.

(ఈశ- కేన- కఠ- ప్రశ్న- ముండ- మాండూక్యములు.)



ఇవి

మహామహోపాధ్యాయ శ్రీపరవస్తు
వేంకటరంగాచార్యులయ్యవారలుం గారిచే
రచియింపఁబడినవి.



వీని గీర్వాణోపనిషత్తులంగూడఁ జేర్చి
విశాఖపట్టణమునందలి యార్షముద్రాశాలయందు
ముద్రింపఁబడి ప్రకటింపఁబడినవి.

---

Published by S. P. V. Ranganathasvami
Ayyavaralugaru,
Printed by R. Appalanarasimham,
at the Arsha Press, Vizagapatam.
1899.
Price 8 Annas.

# పీఠిక.

సర్వ శక్తియును సర్వజ్ఞుండునగు భగవంతుం డీజగం బంతయు సృజయించి యాసేతుహిమాచలంబగు నీభరతఖండం బుననుండు సార్వమతస్థులయిన యాస్తికులందరును గీడుమేలుల నరసి కీడు రాకుండ నైహికాముష్మికసుఖంబు లందుటకుఁ దగిన యుపాయంబులం దెలిసికొనుటకు ముఖ్యసాధనముగా వేదంబులను వేదాంతంబులను బరమర్షులముఖంబున వెల్లడి చేసెనట- అవి యాయాపరమర్షులకాలంబులయందు వాడుకలో నుండిన శైలిగా గీర్వాణభాషయం దున్నవి. అందు వేదాంతంబులే యుపనివత్తులనఁ బడుచున్నవి. అవియాముష్మిక నిత్యసుఖప్రాప్తి కత్యంతోపయుక్తము లగుచున్నవి. కానియాయుపనివత్తులు గీర్వాణ భాషయందే యుండుటం జేసి వానియర్థంబులను వ్యాఖ్యల సహాయమునం గూడ నిష్కృష్టముగా గ్రహించుట కష్టసాధ్యము. ఈయంశము నాలోచించి యెల్లరకును సులభముగాఁ దదర్థబోధ కలుగుటకొరకు సర్వశాస్త్రపారంగతులగుటచేఁ బండిత సార్వభౌములనఁ దగు మహామహోపాధ్యాయ శ్రీ పరవస్తు వేంకటరంగాచార్యు లయ్యవారలుగారు తదర్థ ప్రతిపాదకంబులగు తెనుఁగు పదంబులతో నించుమించుగా నిరువది సంవత్సరంబుల క్రిందట నీశోపనివత్తు పద్యంబులుగా రచియించిరి.

నాలుగు మాసముల క్రిందట నాయాంధ్రోపనివత్తును నేనుఁజూచి దశవిధోపనివత్తుల నిట్లాంధ్రీకరించినచో సర్వజనమహోపకారంబుగ నుండునని యోచించి నేను నస్మన్మాతులు రయిన గోదావరి జిల్లా గూటాల గ్రామనివాసు లగుశ్రీమద్వీరవల్లి వేంకటరంగాచార్యులు వారు నస్మన్మిత్రు లగుబ్రహ్మశ్రీ చేవలి సుబ్రహ్మణ్య శాస్త్రిగారును మొదలగు శిష్యవర్గము శ్రీస్వామివారినిట్లు రచియింపుఁడని ప్రార్థింప శ్రీవారు మాప్రార్థననతికరుణతో నంగీకరించి మతకర్తలు భాష్యములలోను దా

హరించిన వగుటంజేసి ఈశ కేనకఠ ప్రశ్న ముండ మాండూ
క్య తైత్తిరీయ ఐతరేయ బృహదారణ్యక ఛాందోగ్యంబులను
దశవిధోపనిషత్తులే కాక శ్వేతాశ్వతర కౌషీతకులను రెండిటిం
జేర్చి పండ్రెండుపనిషత్తులును ముఖ్యములగుటచే వానిఁ దెనిగిం
ప సంకల్పించి యందు మొదటి యాఱింటిని ముందుగ రచియిం
చి ముద్రింపించిరి.

అస్మన్మాతులురగు వేంకటరంగాచార్యులు గారు శ్రీవారికి
గ్రంథరచనకొఱకు ప్రార్థనాపూర్వకముగాఁ బ్రోత్సాహముచే
యుటయే కాక గ్రంథరచనా కాలమునందెల్ల సహాయముగా
నుండి చక్కగా వ్రాయుచు ముద్రించునప్పుడు శుద్ధ్యశుద్ధులను
జాగరూకతతోఁ బరీక్షించి దిద్దుటవలన నీగ్రంథమింత శీఘ్ర
కాలములోఁ బ్రశస్తముగా ముద్రింపంబడినది.

సంస్కృతప్రాకృతాది సమస్తభాషావిశేష శేషాహీని
ర్విశేషులగు శ్రీస్వామివారి పాండిత్యప్రతిభలను గవితాచాతు
ర్యంబు నిదివరలో శ్రీవారు రచియించిన గ్రంథంబుల నవలో
కించి తెలిసికొనని వారెవ్వరు? తెలిసికొనినపయినానందింపని
వారెవ్వరు? కావునఁ గ్రొత్తగా నీయుపనిషత్కవిత్వమును గొ
నియాడుట యనావశ్యకమనియు నిది యనన్య సాధ్యంబనియు
నీగ్రంథముం జూచిన బుద్ధిమంతు లందరికిని విశదము కాఁగలదు.

ఇందుఁ గేవలకథారూపములుగా నుండు భాగములు త
ఱుచుగా గద్యంబులుగను దక్కిన భాగములు పద్యంబులుగను ర
చియింపఁబడినవి - ఈపుస్తకమును జూచినపై దీనియుపయోగ
మును దెలిసికొని యపేక్షించు జనుల ప్రార్థనంబులఁ బట్టి త
క్కిన యాఱింటిని శ్రీవారు రచియించి ముద్రింపించి ప్రకటింపం
ప సమకట్టి యున్నారని మెఱుంగునది.

ఇట్లు,
వేంకటరంగనాథశర్మ.
*Publisher.*

# ఉపనిషదారంభసూచిక.




| పుట. | ఉపనిషత్తు పేరు. | ఏవేదములోనిది : |
|---|---|---|
| ౧ | ఈశోపనిషత్తు. | శుక్లయజుస్సు. |
| ౭ | కేనోపనిషత్తు. | సామము. |
| ౧౩ | కఠోపనిషత్తు. | కృష్ణయజుస్సు. |
| ౪౪ | ప్రశ్నోపనిషత్తు. | అథర్వము. |
| ౬౭ | ముండకోపనిషత్తు. | ,, |
| ౮౭ | మాండూక్యోపనిషత్తు. | ,, |




☞ తైత్తిరీయము మొదలగు మఱికొన్ని యుపనిషత్తులు కూడ ముద్రింపఁబడి కొద్దికాలములోనే ప్రకటింపఁబడును.



# శోధనపత్రిక.



| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
| --- | --- | --- | --- |
| ౬ | ౩ | త,- ప్రా | తఁ,- బ్రా |
| ,, | ౫ | ెష్మ్యానివ | ెష్మ్యాపనిష |
| ౭ | ౧౩ | ల్పులఁ ధా | ల్పుల ధా |
| ౯ | ౧ | నెత్తిగితి | నెజ్జీఁగితి |
| ౧౦ | ౩ | నుచుం బొ | నుచుఁ బొ |
| ,, | ౪ | దోచె | దోఁచె |
| ౧౩ | ౯ | ప్రోచుత | ప్రోవుత |
| ౧౯ | ౧ | డెవత | దేవత |
| ౨౫ | ౫ | వసము | వస్థము |
| ౩౧ | ౫ | మెలగెడు | మెలఁగెడు |
| ౩౨ | ౧౭ | శేభిర్వ | శేభిర్వాళి |
| ౩౩ | ౫ | పలువి | బలువి |
| ,, | ౧౧ | చునా్నఁ | చునునా్నఁ |
| ౩౪ | ౨ | డున్పర | డున్బర |
| ౩౬ | ౬ | మీద ద | మీదఁ ద |
| ౩౭ | ౪ | జికట | రికట |
| ౪౫ | ౯ | రతిజే | రతిఁజే |
| ౪౯ | ౧ | నఁ ప్రి | నఁ బ్రి |
| ౫౦ | ౧౭ | తేఽశద్ధ | తేఽశ్రిద్ధ |
| ౫౧ | ౧౧ | కు,। పి | కుఁ,। బి |
| ౫౩ | ౧౧ | యోంచు | యోగించు |
| ,, | ,, | ణాంబుగి | ణాంబు |
| ౬౨ | ౫ | డును పు | డును బు |
| ౭౦ | ౭ | కం॥ | మ॥ |
| ౭౭ | ౧ | రంబైన | రంబయిన |



నమఃపరమర్షిభ్యః.

# ఆంధ్రేశోపనిషత్తు.

శాంతి.

కం॥ పూర్ణ మది, పూర్ణమిదియుం, । బూర్ణంబగు దాని వలనఁ బూర్ణము పొడమున్, । బూర్ణ మగుదానిదే యగు । పూర్ణముఁగొని మిగులుచుండుఁ బూర్ణమె యెందున్ ॥

పాఠాంతరము.

కం॥ అది కొదవలేని, దట్టి । య్యదియుఁ, గొడవకననిదా నియందుండియెయ । య్యది పొడఁగను, దానిదెయి । య్యదిగైకొని కొదవలేనియదియే మిగులున్ ॥

---

తే॥గీ॥ ఈశుఁ డగువాని చేతనె యెల్లచోటఁ । బరఁగు జగమె య్యదియుఁ గప్పఁబడుచునుండుఁ, । గానఁ ద్యాగంబె భోగంబుగాఁ గొనఁదగు, । నెవ్వరిధనంబు గోరుట యింకవలదు ॥ ౧

---

## ఈశోపనిషత్.

శాన్తిః.

పూర్ణమదః, పూర్ణమిదం, పూర్ణాత్పూర్ణముదచ్యతే, ।
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే ।

---

౧. ఈశావాస్యమిదగ్ సర్వం యత్కిఞ్చ జగత్యాంజగత్, ।
తేన త్యక్తేన భుఞ్జీథా, మా గృధః కస్య స్విద్ధనమ్ ॥

ఆ॥వె॥ బ్రతుకవలసె నేని శతవత్సరములును । గర్మములను స
లుపుఁగాక, నరున । కింకఁ గర్మలేప మెన్నఁడు లేకుం
డ । నితరమైన త్రోవ యెంచ లేదు ॥ ౨

ఆ॥వె॥ గాఢమైన తమము గ్రమ్మిన యట్టిలో । కములసుర్యము
లనఁ గలవుగొన్ని, । యాత్మఘాతమిందు నాచరించిన
వారు । వానిఁ జెందువారు మేనువిడిచి ॥ ౩

తే॥గీ॥ కదల, దొకండు, డెందము కన్నదురము, । దేవతలె ము
న్నుగాఁ జన్న దీనిఁ జెంద, । దది పఱచునన్యముల మీ
ఱుఁ గదలకుండి, । యందు వాయువు గ్రియలనింపొం
దఁ జేయు ॥ ౪

కం॥ అది కదలెడి, నదియు కదల, । దది దూరమునందు, న
దియ యభ్యాశమునం, । దదియెల్లజగమునకు లో, । న
దియీయెల్లజగములకు నమరు న్వెలివై. ॥ ౫

కం॥ తిలకింప నఖిలభూతం । బులు దనయందఖిలభూతముల
లోఁ దన్నున్ । నెల కొన్న వానిఁ గామదిఁ । దలఁచు నె

---

౨. కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేచ్ఛతగ్ం సమాః, । ఏవం
త్వయి నాన్యథేతో౽స్తి న కర్మ లిప్యతే నరే ॥

౩. అసుర్యా నామ తే లోకా అన్ధేన తమసావృతాః, ।
తాంస్తే ప్రేత్యాభిగచ్ఛన్తి యే కే చాత్మహనో జనాః ॥

౪. అనేజ, దేకం, మనసో జవీయో, నైనద్దేవా ఆప్నువన్పూ
[illegible], । తద్ధావతో౽న్యానత్యేతి తిష్ఠ, త్తస్మిన్న
పో మాతరిశ్వా దధాతి ॥

౫. తదేజతి, తన్నైజతి, తద్దూరే, తద్వన్తికే, । తదన్తరస్య
సర్వస్య, తదు సర్వస్యాస్య బాహ్యతః ॥

౬. యస్తు సర్వాణి భూతాని ఆత్మన్యేవానుపశ్యతి । సర్వ
భూతేషు చాత్మానం తతో న విజుగుప్సతే ।

వ్వాఁడు గొనఁడతండు జుగుప్సన్ ॥ ౬

తే॥గీ॥ ఎందుఁ దెలిసిన వానికి నెల్లభూత। ములును నాత్మయౌ,
నేకత్వమును గ్రహించు। నట్టి వానికి శోక మెయ్యది
యనఁదగు। నట్టివానికి నెద్ది మోహ మగు నందు ॥ ౭

తే॥గీ॥ వ్యాపి శుక్రుఁ డకాయుఁ డవ్రణుఁ డసిరుఁడు। శుద్ధుఁ
డు మనీషి కవి యఘావిద్ధుఁ డతఁడు। పరిభువు స్వయం
భు వర్థము ల్పంచి యిచియె। నెల్ల వత్సరములకుఁగా నె
ట్టు లట్ల ॥ ౮

ఆ॥వె॥ ఎవ్వ రిందవిద్య నింపుగాఁ గొలుతురు। వారి కంధత
మస వాసమె యగు,। విద్యయందె నిలిచి వెలసిన వా
రికి। నంతకన్న నెక్కుడ మయ్యెడనది ॥ ౯

ఆ॥వె॥ విద్యచేత నన్య విధమైన ఫలమౌ,చు। విద్యచేత నన్య విధ
ము గలుగు,। ననుచు నివ్వి రెండు మనకిట్లు దెలిపిన।
ధీర వరుల వలనఁ దెల్ల మయ్యె ॥ ౧౦

కం॥ విద్యయు నవిద్యయును నిర। వద్యముగా నెవ్వఁడెఱుఁ

---

౭. యస్మిన్ సర్వాణి భూతాని ఆత్మైవా భూద్విజానతః,।
తత్ర కో మోహః కః శోక ఏకత్వమనుపశ్యతః ॥

౮. స పర్యగాచ్ఛుక్రమకాయమవ్రణమస్నావిరగ్ం శుద్ధమ
పాపవిద్ధమ్। కవిర్మనీషీ పరిభూః స్వయమ్భూ ర్యాథా
థాతథ్యతోఽర్థాన్ వ్యదధాచ్ఛాశ్వతీభ్య స్సమాభ్యః ॥

౯. అన్ధంతమః ప్రవిశన్తి యే ఽవిద్యాముపాసతే,। తతో
భూయఇవ తే తమో య ఉ విద్యాయాగ్ రతాః।

౧౦. అన్యదేవాహుర్విద్యయా, అన్యదాహురవిద్యయా,। ఇతి
శుశ్రుమ ధీరాణాం యే నస్తద్విచచక్షిరే ॥

౧౧. విద్యాంచావిద్యాంచ యస్తద్వేదోభయగ్ సహ। అవిద్య

గువాఁడగ్రిమమునన్ । హృద్యముగాఁ జెందుచుండున ।
విద్యన్ మృత్యువును గడచి విద్య నమృతమున్ ॥ ౧౧

తే॥ గీ॥ ఇంతసంభూతిఁ గొల్చుచునుందు రెవరు । వారలకునంధ తమస నివాసమె యగు, । మఱియు సంభూతిఁ జేకొన మనసు గలుగు । వారలకునది యెక్కుడై వఱలుచుండు ॥ ౧౨

ఆ॥ వె॥ సంభవంబు వలన సంభవించు నితర । ఫల,మసంభవంబు వలన నన్య, । మనుచు నివ్వి రెండు మనకిట్లు చెప్పిన । ధీరవరులవలనఁ దెల్ల మయ్యె ॥ ౧౩

ఆ॥ వె॥ సరవి నెవ్వఁడిందు సంభూతియు వినాశ । మనెడు రెంటిఁ దోన యాశ్రయించు, । మున్నుగా వినాశమున మృత్యువును దాఁటి । యతఁడు సంభవమున నమృతమందు ॥

ఆ॥ వె॥ ఓయి పూషదేవ జ్యోతిర్మయామత్రి । మున వృతంబు సత్య ముఖము, గాన । దాని విఘటనంబు దగనొనరింపుమీ । సత్య ధర్మ దృష్టి సంఘటిల్ల ॥ ౧౫

తే॥ గీ॥ పూష యేకర్షి యమ సూర్య ప్రోవు సేయు । కరములఁ

---

యా మృత్యుం తీర్త్వా విద్యయా ఽమృతమశ్నుతే ॥

౧౨. అన్ధంతమః ప్రవిశన్తి యేఽసమ్భూతిముపాసతే, । తతో భూయ ఇవ తే తమో య ఉ సమ్భూత్యాగ్ం రతాః ॥

౧౩. అన్యదేవాహుస్సమ్భవా,దన్యదాహురసమ్భవాత్, । ఇతి శుశ్రుమ ధీరాణాం యే నస్తద్విచచక్షిరే ॥

౧౪. సమ్భూతించ వినాశంచ యస్తద్వేదోభయగ్ం సహ, । వినాశేన మృత్యుం తీర్త్వా సమ్భూత్యామృతమశ్నుతే ॥

౧౫. హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపిహితం ముఖమ్, । తత్త్వంపూషన్నపావృణు సత్యధర్మాయ దృష్టయే ॥

౧౬. పూషన్నేకర్షే యమ సూర్య ప్రాజాపత్య వ్యూహ

గిరిజాపతిభవ గూర్పువరమహంబు,। శుభతమంబైననీ రూపుఁజూచువాఁడ। నట్టి యాపురుషుండ నేనైతిఁగాన॥
ఆ॥ వె॥ ప్రాణ మమృతమైన యనిలంబుఁ జేరుత,। నింక బూదిగాత నీశరీర, । మోంపదార్థ మైన యోక్రతువా నన్నుఁ। దలఁచి నాదుకృతముఁ దలఁపవలయు ॥ ౧౭
ఆ॥ వె॥ మంచి త్రోవనడుపు మమ్ము నో యగ్నికి। యాఫలాప్తి, కెఱుఁగు దన్నినీవు.। పాపుమాదు కుటిల పాపంబు,లిడుదుము । మొక్కుఁ పలుకునీకుఁ జెక్కు గతుల ॥ ౧౮

ఇతి మహామహోపాధ్యాయ శ్రీపరవస్తు
వేంకటరంగనాథాచార్యార్య వరగురు కృతు
లలోనాంధ్రేశోపనిషత్తు.

---

రశ్మీన్ సమూహ తేజః, । యత్తే రూపంకల్యాణతమం తత్తే పశ్యామి యోఽసావసౌ పురుషః సోఽహమస్మి॥
౧౭. వాయురనిలమమృత, మథేదం భస్మాన్తగ్ం శరీరమ్,। ఓం క్రతో స్మర కృతగ్ం స్మర క్రతో స్మర కృతగ్ం స్మర॥
౧౮. అగ్నే నయ సుపథా రాయే అస్మాన్,విశ్వాని దేవ వయునాని విద్వాన్, । యుయోధ్యస్మజ్జుహురాణ మేనో, భూయిష్ఠాం తే నమఉక్తిం విధేమ॥

ఇతీశోపనిషత్సమాప్తా॥



# ఆంధ్రకేనోపనిషత్తు.

---

శాంతి.

సీ॥ ఆప్యాయితములు నాయంగంబులగుఁగాత,- ప్రా
ణంబువాక్కు నేత్రంబు చెవియు । బలమఖిలేంద్రియంబులు
నట్లయగుఁగాత,- నిఖిలంబు బ్రహ్మోపనిషదమెయగు,। బ్రహ్మం
బు నేను నిరాకరింపఁగరాదు,- బ్రహ్మంబునన్ను నిరాకరింప।రా,
దెందును నిరాకరణము కాకుండుఁగా-వుత, లేకయుండుఁ గావు
తమదీయ ॥ మగునిరాకరణంబును, నాత్మనిరత! మైనచోటున
నుపనిషద్వ్యాహృతంబు । లైనధర్మంబు లెల్లనాయందు నెపు
డు । గలుగుఁగాత నాయందవి గలుగుఁగాత ॥

---

తే॥గీ॥ ఎవ్వఁ డిష్టతఁ బ్రేరింప నేగు మనము,। నడఁచు నెవ్వ
ని చేతఁ బ్రాణంబు మొదటి,। దెవ్వని ప్రయుక్తి నీ

---

## కేనోపనిషత్.

శాన్తిః.

ఆప్యాయన్తు మ మాంగాని, వాక్ప్రాణ శ్చక్షుశ్శ్రోత్ర
మథోబల మిన్ద్రియాణి చ సర్వాణి, సర్వం బ్రహ్మౌ
పనిషదం,మాహం బ్రహ్మ నిరాకుర్యాం, మామా బ్రహ్మ
నిరాకరో,దనిరాకరణ మ,స్త్వనిరాకరణం మే అస్తు,
తదాత్మని నిరతే య ఉపనిషత్సు ధర్మా స్తే మయి స
న్తు తే మయి సన్తు॥ (ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః.)

---

౧. కేనేషితం పతతి ప్రేషితం మనః, కేనప్రాణః ప్రథమః

పలుకొసఁగు నందుఁ, । కన్నుఁ జెప్పియు నేదేవు కల
ననమరు ॥ ౧

తే.గీ॥ వినునకు విను మనమున కేని మనము । పలుకునకుఁ బలుకు ప్రాణంబు ప్రాణమునకుఁ। గలఁడు గన్ను కన్నునకని తెలిసి ధీరు । లీజగమునుండి వెడలి యమృతు లగుదురు ॥ ౨

ఆ॥వె॥ అందుఁ గన్ను నడవ, దట్లు పలుకను జెల్ల.।దట్లు మనమునందు నరుగ నేర,। దట్టి తత్త్వ మిట్టి దని యనుశాసింప । నెన్న లేము మఱియు నెఱుఁగ లేము॥ ౩

ఆ॥వె॥ వేఱు గానె యుండు విదితంబుకంటె, న। ట్లవిదితంబు కంటె నన్యమెయగు,। నిట్లు గన్నవార మీతత్త్వము మనకు । వ్యాఖ్య సేయు పెద్దవారివలన ॥ ౪

కం॥ ఏది పలుకునఁ దెలుపఁగరా । నిది, పలుకుల నేది తెలుప నేరుచునో,య । య్యదెబ్రహ్మ, మెల్లవారలు। నెది దలఁతురు కాదిదదనియో వెఱుఁగ వలెన్ ॥ ౫

---

ప్రైతియుక్తః, । కేనేషితాం వాచమిమాం వదన్తి,
చక్షుశ్శ్రోత్రంక ఉ దేవో యునక్తి ॥

౨. శ్రోత్రస్యశ్రోత్రం మనసోమనో యద్వాచో హవాచం స ఉ ప్రాణస్యప్రాణః । చక్షుష శ్చక్షురతి ముచ్యధీరాః ప్రేత్యాస్మాల్లోకాదమృతా భవన్తి ॥

౩. నతత్రచక్షుర్గచ్ఛతి, నవాగ్గచ్ఛతి, నో మనః।
నవిద్మోనవిజానీమో యథైతదనుశిష్యాత్ ॥

౪. అన్యదేవతద్విదితా,దథో అవిదితాదధి, ।
ఇతిశుశ్రుమపూర్వేషాం యేనస్తద్వ్యాచచక్షిరే ॥

౫. యద్వాచానభ్యుదితం, యేనవాగభ్యుద్యతే ।

కం॥ ఏది దెలియఁ జాలమల్లం, । బెది యుల్లముఁ దెలుపునం
దు రెఱిఁగినవా,ర। య్యదె బ్రహ్మ, మెల్లవారలు । నె
ది దలఁతురు కాదిదదని యీవెఱుఁగవలెన్ ॥ ౬

కం॥ ఏది గాన లేఁడు గన్నున, । నేది గన్నులు గనుఁగొను
టదు హేతుతఁగను, న । య్యదె బ్రహ్మ, మెల్ల వారలు।
నేది దలఁతురు కాదిదదని యీవెఱుఁగవలెన్ ॥ ౭

కం॥ ఏది వీనుల వినఁగా లేఁ, । డెది వీనులు వినఁగఁ దా
నె హేతుతఁగను, న। య్యదె బ్రహ్మ, మెల్ల వారలు।
నేది దలఁతురు కాదిదదని యీవెఱుఁగవలెన్ ॥ ౮

కం॥ ఏది ప్రాణమునఁ బ్రతుకవల, । దెది ప్రాణము బ్రతు
ఖుఁ జెంద హేతుతఁగను,న। య్యదెబ్రహ్మ, మెల్ల వా
రలు। నేది దలఁతురు కాదిదదని యీవెఱుఁగవలెన్ ॥

---

కం॥ తెలిసితిఁగడు నని తలఁపఁగ। నిల వేల్పులఁ దాని .రూ

---

తదేవబ్రహ్మత్వంవిద్ధి, నేదం యదిదముపాసతే ॥

౬. యన్మనసానమనుతే, యేనాహుర్మనోమతమ్, ।
తదేవబ్రహ్మత్వం విద్ధి, నేదంయదిదముపాసతే ॥

౭. యచ్చక్షుషానపశ్యతి, యేనచక్షూంషిపశ్యతి, ।
తదేవబ్రహ్మత్వంవిద్ధి, నేదంయదిదముపాసతే ॥

౮. యచ్ఛ్రోత్రేణనశృణోతి, యేనశ్రోత్రమిదంశ్రుతమ్, ।
తదేవబ్రహ్మత్వంవిద్ధి, నేదం యదిదముపాసతే ॥

౯. యత్ప్రాణేనసప్రాణితి, యేన ప్రాణఃప్రణీయతే, ।
తదేవబ్రహ్మత్వంవిద్ధి, నేదంయదిదముపాసతే ॥

ఇతిప్రథమఃఖణ్డః.

౧౦. యదిమన్యసే సువేదేతిదభ్రమేవాపి నూనం త్వంవే

పు నెఱిగితి లవమే,। కలరూపిట పైఁ దెలియ । న్వాలే
నన, నాకిపుడు తెలిసె వాస్తవ మనియున్ ॥ ౧౦

కం॥ తెలిసితి లెస్సఁగ నేనని । తలఁపఁ, దెలియనైతి నని
యుఁ దలఁపఁ, దెలిసితిన్, । దెలియు మనలోన నె
వ్వఁడు । దెలిసితిఁ దెలియననఁ, యతఁడు దెలియున్
దానిన్ ॥ ౧౧

తే॥గీ॥ ఎఱుఁగ రాని దెవ్వనికి వాఁడెఱుఁగుదాని,। నెఱుఁగ
నా నెవ్వనికి నది యెఱుఁగఁడతఁడు, । దెలియు వార
ల కయ్యది తెలియ రాదు, । దెలియకున్న వారల కది
దెలియ నయ్యె ॥ ౧౨

కం॥ ప్రతిబోధ విదిత మనియది। మత, మమృతత దానఁ
గలుగు, మఱియాత్మ ప్రస । న్నతఁగన వీర్యము గలు
గు, న । మృతత్వ మావిద్య వలన నే చెందనగున్ ॥

ఆ॥ వె॥ తెలిసె నింద యేని కలదు సత్యఁ, బిందఁ । దెలియ దే
ని మిగులఁ గలదు నష్టి, । ప్రాణులందు నెల్లఁ బరికిం

---

త్థబ్రహ్మణో రూపమ్। యదస్యత్వం యదస్య దేవే,ష్వథ
ను మీమాంస్యమేవ తే, మన్యే విదితమ్ ॥

౧౧. నాహం మన్యే సువేదేతి, నో న వేదేతి, వేద చ, ।
యో నస్తద్వేద తద్వేద నో న వేదేతి, వేద చ ॥

౧౨. యస్యామతం తస్య మతం, మతం యస్య న వేద సః, ।
అవిజ్ఞాతం విజానతాం, విజ్ఞాతమవిజానతామ్ ॥

౧౩. ప్రతిబోధవిదితం మత, మమృతత్వం హి విన్దతే ।
ఆత్మనా విన్దతే వీర్యం, విద్యయా విన్దతేఽమృతమ్ ॥

౧౪. ఇహ చేదవేదీదథ సత్యమస్తి, న చేదిహావేదీన్మహతీ వినష్టిః, । భూతేషు భూతేషు విచిన్త్య ధీరాః ప్రేత్యాస్మా

చి యది ధీరు । లీజగంబెడలియమృతులగుదురు ॥ ౧౫॥

---

కం॥ గెలిపించెన్ బ్రహ్మము వే । ల్పులనది తమ విజయ మనుచుం బొగడి కొనిరి వే । ల్పులు తమ మహిమము లని యది । తెలిసిన బ్రహ్మంబు దోచె దివ్యాకృతి వైపు॥ ౧౬ ॥ కం॥ ఈపయ్యంబెయ్యది యని । యాదేవత లెల్లనబ్రి మంది సభయులై । యాది హుతాశను నంపిరి । సాదరుడై దాని చెంత కతడే తెంచెన్ ॥ ౧౭ ॥ కం॥ నీవెవ్వడ వనియ డుగగ । నేవహ్నినగంగ నెద్ది నీవీర్యమనన్ । నేవేల్తునన్నియు ననన్ । దేవత పూరియిడి కాల్పు దీనిననంగన్ ॥ ౧౮॥ కం॥ తన వేగ మెంత చేసియు । ననలుం డది గాల్ప లేక యపుడె మరలగా । ననిలుని వారలు పనుపగ । బనివడి యా

---

ల్లోకా దమృతా భవన్తి ॥

ఇతిద్వితీయఃఖణ్డః.

బ్రహ్మ హ దేవేభ్యో విజిగ్యే తస్య హ బ్రహ్మణో విజయే దేవా అమహీయన్త । త ఐక్షన్తాస్మాక మేవాయం విజయోఽస్మాక మేవాయం మహిమేతి ॥ ౧ ॥ తద్ధైషాం విజజ్ఞౌ తేభ్యో హ ప్రాదుర్బభూవ తన్న వ్యజానన్త కిమిదం యక్షమితి ॥ ౨॥ తేఽగ్నిమబ్రువన్ జాతవేద ఏతద్విజానీహి కిమేతద్యక్షమితి తథేతి ॥ ౩ ॥ తదభ్యద్రవత్తమభ్యవదత్కోఽసీతి అగ్నిర్వా అహమస్మీత్యబ్రవీజ్జాతవేదా వా అహమస్మీతి ॥ ౪ ॥ తస్మింస్త్వయి కిం వీర్యమిత్యపీదగ్ సర్వం దహేయం యదిదం పృథివ్యామితి ॥ ౫ ॥ తస్మై తృణం నిదధావేతద్దహేతి తదుపప్రేయాయ సర్వజవేన తన్న శశాక దగ్ధుం స తత ఏవ నివవృతే నైతదశకం విజ్ఞాతుం యదేతద్యక్షమితి ॥ ౬ ॥ అథ వాయుమబ్రువన్ వాయవేతద్విజానీహి

తండు డాని పజ్జకువచ్చెన్ ॥ ౧౮ ॥ కం॥ నీవెవ్వఁడ వనియ
డుగఁగ । నేవాయువు ననఁగ వీర్యమెద్ది యనంగా । నేవిసరె
ద నన్నిటి నన । దేవత పూరి యిడి విసరు దీని ననంగన్ ॥
౧౯ ॥ కం॥ తనవేగ మెంత చేసియు । ననిలుం డది విస
రలేక యపుడె మఱలనిం । ద్రుని వారలు వనుప నతఁడు ।
తనకై రా నది తిరోహితత్వముఁ జెందెన్ ॥ ౨౦ ॥ కం॥ వ
నిత నుమ నధిక శోభన్ । వినువీథిం గాంచి దానివిధము న
డుగఁదె । ల్పెనదియు బ్రహ్మము గెలిపిం । చినదదె యననతఁ
డు సంతసిల్లెమనమునన్ ॥ ౨౧ ॥ కం॥ అనలానిలేంద్రులా
దిం । గనుఁగొనిరా బ్రహ్మ మ్మికటంగతులగుచున్ । జను

---

కిమేతద్యక్షమితితథేతి ॥ ౭ ॥ తదభ్యద్రవత్తమభ్యవదత్కోఽసీ
తివాయుర్వా అహమస్మీత్యబ్రవీన్మాతరిశ్వావా అహమస్మీతి॥౮
తస్మింస్త్వయికింవీర్యమిత్యపీదగ్ంసర్వమాదదీయంయదిదంపృథి
వ్యామితి॥ ౯ ॥ తస్మైతృణంనిదధావే తదాదత్స్వేతి తదుప
ప్రేయాయ సర్వజవేన తన్నశశాకాదాతుంసతతఏవనివవృ
తే నైతదశకంవిజ్ఞాతుం యదేతద్యక్షమితి ॥ ౧౦ ॥ అథేన్ద్రమ
బ్రువన్మఘవన్నేతద్విజానీహికిమేతద్యక్షమితి తథేతి తద
భ్యద్రవత్తస్మాత్తిరోదధే॥ ౧౧ ॥సతస్మిన్నేవాకాశేస్త్రియమా
జగామబహుశోభమానాముమాం హైమవతీంతాగ్ం హోవా
చకిమేతద్యక్షమితి ॥ ౧౨ ॥ ఇతితృతీయఃఖణ్డః.

సాబ్రహ్మేతిహోవాచబ్రహ్మణోవాఏతద్విజయే మ
హీయధ్వమితితతోహైవవిదాఞ్చకారబ్రహ్మేతి॥౧॥ తస్మాద్వా
ఏతేదేవా అతితరామివాన్యాన్ దేవాన్ యదగ్నిర్వాయు
రింద్రస్తేహ్యేనన్నేదిష్ఠం పస్పృశుస్తేహ్యేనత్ప్రథమో
విదాంచకారబ్రహ్మేతి ॥౨॥ తస్మాద్వా ఇంద్రోఽతితరామి

డెంచి తెలిసె సంక్రిం। దనుచును గావునఁ గడుం బ్రిధానుం
డయ్యెన్ ॥ ౨౨ ॥ కం॥ విద్యావంతుఁడు బ్రిహ్మము వి। ద్యుద్వి
ద్యుత్తి నధి దైవతోపాసకతన్ । దద్వనమని యధ్యాత్మల ।
సద్వృత్తిం దలఁచి యమరు సర్వాఢ్యుండై ॥ ౨౩ ॥ తే॥ గీ॥
ఉపనిషత్తిది దీనికిఁ దపము దమము । కర్మము ప్రితిష్ఠ వేదమం
గములతోడ । సత్య మాయతనంబుపాసనము సేయ । సఘము
లనడంచి స్వర్గ లోకాప్తిఁ జేయు॥ ౨౪ ॥

ఇతిమహో మహోపాధ్యాయశ్రీపరవస్తు
వేంకటరంగనాథాచార్యార్యవరగురు కృతు
లలోనాంధ్రికేనోపనిషత్తు.

---

వాన్యాన్ దేవాన్ సహ్యేనన్నేదిష్ఠంపస్పర్శ స హ్యేనత్ప్రథ
మోవిదాంచకారబ్రహ్మేతి ॥ ౩ ॥ తస్యైష ఆదేశో యదేతద్వి
ద్యుతోవ్యద్యుతదాఇతీన్న్యమీమిషదాఇత్యధిదైవతమ్॥ ౪ ॥
అథాధ్యాత్మం యదేతద్గచ్ఛతీవచమనోనేనచైతదు పస్మరత్యభీ
క్ష్ణంసంకల్పః ॥ ౫ ॥ తద్ధ తద్వనంనామతద్వనమిత్యుపాసితవ్యం
సయఏతదేవంవేదాభిహైనంసర్వాణి భూతానిసంవాఞ్ఛన్తి
॥ ౬ ॥ ఉపనిషదంభోబ్రూహీత్యుక్తాతఉపనిషద్బ్రాహ్మీం
వావత ఉపనిషదమబ్రూమేతి ॥ ౭ ॥ తస్యై తపోదమః కర్మేతి
ప్రతిష్ఠావేదాస్సర్వాఙ్గానిసత్యమాయతనమ్ ॥ ౮ ॥ యోవాఏ
తామేవంవేదా పహత్యపాప్మానమనన్తేస్వర్గేలోకేజ్యేయేప్ర
తితిష్ఠతిప్రతితిష్ఠతి ॥ ౯ ॥ ఇతిచతుర్థఃఖణ్డః.

ఇతికేనోపనిషత్సమాప్తా

# ఆంధ్ర కఠోపనిషత్తు.

---

శాంతి.

తే.గీ॥ మనల నిరువురఁ బ్రోచుఁ, దోడనే యిరువురకు మ
నలఁ బాలించుఁ గావుత, మనము వీర్య। మొకట మొ
గిఁ జేయుదము గాత, నుభయుల చదు। వాలయుఁ
దేజము, ద్వేషమూ వలదు మనకు॥ (శాన్తి శాన్తి శాన్తి)

పాఠాంతరము.

చం॥ మనల నతండు ప్రోచుత సమంబుగఁ, బాలన సే
యుఁ గావుతన్, । మనముసు వీర్యమొకట మొగి మా
నక చేయుము గాత । నెప్పుడున్, మనదగు నీయధీతము
ను మానిత తేజము గాత, ద్వేషమున్। మన కెపుడున్
దొలంగుత, శమంబు శమంబు శమంబు గావుతన్॥

---

సీ॥ వాజశ్రవసుఁడు సర్వస్వదక్షిణము కామ్యార్థక్రతువు
చేసె, నతనిసుతుఁడు। నచికేతుఁ(౧), డతఁడు మా

---

## కఠోపనిషత్.

శాన్తిః.

సహనావవతు। సహనౌ భునక్తు। సహవీర్యంకరవా
వహై। తేజస్వినా వధీతమస్తు, మావిద్విషావహై।
( ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః )

---

౧. ఉశన్ హ వై వాజశ్రవసః సర్వవేదసం దదౌ, తస్య
హ నచికేతా నామ పుత్ర ఆస ॥

ణావుఁ డయ్యును దక్షిణల నిచ్చుతఱి శ్రద్ధ కలిగె నత
ని(౨),। కంబువుల్ త్రావి తృణంబులు మేసి దో
హము లుడిగి నిరింద్రియములగు పసుల। దానం బొసఁగ
ననందములను లోకముల్ ప్రాప్యంబు లని యెంచి
(౩), యయ్య! నన్ను ॥ నెవ్వనికి నిత్తు వని యతఁ డిట్లు
మఱియు। ననఁగ, నిను మిత్తికిచ్చెద నని యతఁడ
నఁ(౪),। బలువురికి మున్ను నడుమ నేఁ గలను న
డవ,। ననుఁ గని కృతాంతుఁ డొనరించు పని యె
దియొకో(౫)॥ ౧

క॥ మునుపటి సాధువు లెట్టులు। చని, రిప్పటివార లెట్లు
చనుదు, రది కనుం। గొను మయ్య, పైరువోలెన్।
మనుజుఁడు పండి చనిపోవు మఱలం బుట్టున్(౬)॥ ౨

క॥ అనలుఁ డతిథి విప్రుండై। చనుదెంచి గృహంబుఁ జొ

---

౨. తగ్ం హ కుమారగ్ం సన్తం దక్షిణాసు నీయమానాసు శ్రద్ధా వివేశ సో ఽమన్యత ॥

౩. పీతోదకా జగ్ధతృణా దుగ్ధదోహా నిరిన్ద్రియాః। అనన్దా నామ తే లోకా స్తాన్ స గచ్ఛతి తా దదత్॥

౪. స హోవాచ పితరం తత కస్మై మాం దాస్యసీతి। ద్వితీయం తృతీయం, తగ్ం హోవాచ మృత్యవే త్వా దదామీతి ॥

౫. బహూనా మేమి ప్రథమో బహూనా మేమి మధ్యమః,। కిగ్ం స్విద్యమస్య కర్తవ్యం య న్మయాద్య కరిష్యతి ॥

౬. అనుపశ్య యథా పూర్వే, ప్రతి పశ్య తథాపరే,। సస్యమివ మర్త్యః పచ్యతే సస్యమివా జాయతే పునః॥

౭. వైశ్వానరః ప్రవిశ త్యతిథి ర్బ్రాహ్మణో గృహాన్,। త

చ్చుఁ, జయ్యైన శాన్తిం । గని చేతురు పెద్దలు, కా ।
వున నర్ఘ్యోదకము లిడుట పొసఁగున్ శమనా (౭)॥ ౩

క॥ అనశనత నతిథి యస్మద్గృహ । మున నుండున్ గుమతి య
తఁడు పూర్తము నిష్టం । బును సంగత మాశఁ బ్రతీ
తీ । ష్టను సూనృతపుత్రపశుల సర్వముఁ దొలఁగున్
(౮) ॥ ౪

క॥ అనశనత విప్ర నాగృహ । మున నుంటి వతిథివి మేలు
మూఁడు నమస్యా,। నను మేలు చెందు, నిడె నీ । కు
నమస్కృతి, కాన మూఁడు కోరుము వరముల్ (౯)॥ ౫

క॥ తనసంకల్పం బుడిగి సు । మనస్కుఁడై గౌతముండు
మన్యు వెడలి నీ । పనుపునఁ జను నను యమ కనుఁ ।
గొని పలుకుంగాత, మొదటఁ గోరు వర మిదే (౧౦)

ఆ॥ వె॥ మృత్యుముఖమునుండి వెడలి నాపనుపునఁ । బొందు ని
న్ను మున్నునో లెఁ గాంచి । యరుణపుత్రుఁ డైన

---

న్యైతాగ్ శాన్తిం కుర్వన్తి హర వైవస్వతోదకమ్ ॥

౮. ఆశాప్రతీక్షే సఙ్గతగ్ సూనృతాం చేష్టాపూర్తే పు
త్రపశూగ్శ్చ సర్వాన్ । ఏతద్వృఙ్క్తే పురుషస్యాల్ప
మేధసో యస్యానశ్నన్ వసతి బ్రాహ్మణో గృహే ॥

౯. తిస్రో రాత్రీర్యదవాత్సీర్గృహే మేఽనశ్నన్ బ్రహ్మ
న్నతిథిర్నమస్యః, । నమస్తేఽస్తు, బ్రహ్మన్ స్వస్తి మేఽ
స్తు, తస్మాత్ప్రతి త్రీన్ వరాన్ వృణీష్వ ॥

౧౦. శాన్తసఙ్కల్పస్సుమనా యథా స్యాద్వీతమన్యు
ర్గౌతమో మాభిమృత్యో । త్వత్ప్రసృష్టం మాభివదేత్ప్ర
తీత, ఏతత్త్రయాణాం ప్రథమం వరం వృణే ॥

౧౧. యథా పురస్తాద్భవితా ప్రతీత ఔద్దాలకిరారుణిర్మ
త్ప్రసృష్టః। సుఖగ్ రాత్రీః శయితా వీతమన్యుస్త్వాం

యౌద్దాలకి సుఖంబు। గాఁ బరుండుఁ బ్రీతి కలిగి ని
శల(౧౧) ॥ ౭

క॥ నాకము లోకము కల,దది । భీకరరహితంబు, ముదిమిఁ జెదరక నిన్నున్ । శోకము నాఁకలి దప్పిన్ । గైకొన కెపుడుం జనుండు కను మోదంబున్ (౧౨)॥ ౮

క॥ ఈ వేలుఁగుడు వట, స్వర్గ్యం। బౌ వహ్నిని శ్రద్ధతోడ నమరిన నాకున్ । దేవ తెలుపు, మమృతత్వా । ర్గావాసుల కగు, ద్వితీయ మను వరమిదియే (౧౩)॥ ౯

క॥ నచికేతుండా నీకున్ । వచింతు స్వర్గప్రదమగు వహ్నిఁ దెలియుము, మీ । యచలపదమునఁ బ్రతిష్ఠను । విచక్షణమనోగుహాస్థవిద్య యిది యిడన్ (౧౪) ॥ ౧౦

తే॥గీ॥ ఎవ్వియో పేర్చు నిట్టిక, లెన్ని, యెటుల,। నవ్విధము తోడ లోకాదివైన యగ్ని । నా యముఁడు సెప్పె,

---

దదృశివాన్ మృత్యుముఖాత్ప్రముక్తమ్ ॥

౧౨. స్వర్గే లోకే న భయం కించ నాస్తి,న తత్ర త్వం,న జరయా బిభేతి,। ఉభే తీర్త్వా అశనాయాపిపాసే శోకాతిగో మోదతే స్వర్గలోకే ॥

౧౩. సత్వమగ్నిగ్ స్వర్గ్యమధ్యేషి మృత్యో, ప్రబ్రూహి తగ్ శ్రద్ధధానాయ మహ్యమ్,। స్వర్గలోకా అమృతత్వం భజన్త, ఏత ద్ద్వితీయేన వృణే వరేణ ॥

౧౪. ప్ర తే బ్రవీమి తదు మే నిబోధ స్వర్గ్య మగ్నిం నచికేతః ప్రజానన్,। అనన్తలోకాప్తి మథో ప్రతిష్ఠాం విద్ధి త్వమేన న్నిహితం గుహాయామ్ ॥

౧౫. లోకాది మగ్నిం త మువాచ తస్మై యా ఇష్టకా యావతీ ర్వా యథా వా,। సచాపి తత్ప్రత్యవద ద్యథోక్తం,

నాతండు ననువదించె,। యముఁడు వెండియు సంతు
ష్టుఁ డగుచుఁబలికె (౧౫) ॥ ౧౧.

తే॥గీ॥ మఱియు నీయగ్నితోడ సంబంధము గల। వరమొసం
గెదఁ, దెలియు మీవహ్ని నాచి। కేత మని పేరువడి
నీకుఁ గీర్తి నొసఁగుఁ,। జిత్రశబ్ద మాలికనిత్తుఁ జేకొ
నుమిది (౧౬)॥ ౧౨.

చ॥ త్రితయములోడ సంధిఁ గని త్రిక్రియుఁడైన త్రిణాచి
కేతుఁ డు। ధృతిమెయి జన్మమృత్యువుల దాటిన వాఁ
డగు, సర్వలోకసం। స్తుతి గను, బ్రహ్మజజ్ఞుఁ డయి
పొంపెలు దేవునిఁ దెల్సిఁ గాంచుచున్। సతతము ధ్యా
నమున్ సలిపి శాంతి నితాంతముఁ జెందుఁ జక్క
గన్(౧౭) ॥ ౧౩

ఆ॥వె॥ కృతియగుం ద్రిణాచికేతుఁ డీత్రితయంబు। నడపుఁదె
లిసికొనుచు నాచికేత। చయనమునను, మృత్యు
జనకపాశము లూడ్చి। శోక మెడలి స్వర్గసుఖముఁ
గాంచు(౧౮) ॥ ౧౪

---

మథాస్య మృత్యుః పున రేవాహ తుష్టః ॥

౧౬. త మబ్రవీత్ప్రీయమాణో మహాత్మా వరం తవేహాద్య
దదామి భూయః, ।తవైవ నామ్నా భవితా యమగ్నిః,
సృఙ్కాం చేమా మనేక రూపాం గృహాణ ॥

౧౭. త్రిణాచికేత స్త్రిభి రేత్య సన్ధిం త్రికర్మకృ త్తరతి జన్మ
మృత్యూ,। బ్రహ్మజజ్ఞం దేవ మీడ్యం విదిత్వా నిచాయ్యే
మాం శాన్తి మత్యన్త మేతి ॥

౧౮. త్రిణాచికేత స్త్రయ మేత ద్విదిత్వా య ఏవం విద్వాం
శ్చినుతే నాచికేతమ్,।స మృత్యుపాశాన్ పురతః ప్ర
ణోద్య శోకాతిగో మోదతే స్వర్గలోకే ॥

తే॥ గీ॥ అరయ బ్రహ్మజజ్ఞాత్మకంబైన యిట్టి। చితి తెలిసినాచికేత్రాఖ్యచితి నొనర్చు। వాఁడు బ్రహ్మజజ్ఞాత్మభావంబు నొందు। యపునరుద్భవకారణం బాచరించు(౧౯)॥

క॥ ఓనచికేతుఁడ స్వర్గ్యం। బౌ నీయనలంబు చనుఁ ద్వితీయమున, ని। ద్దానిద్వితీయవరంబుగఁ। బూని వరింపు మిఁక నీవు మూఁడవ వరమున్(౨౦)॥ ౧౬

తే॥ గీ॥ ప్రేతుఁడైనమనుష్యునియెడఁ గలఁడని। కొందరును లేఁడనుచు మఱికొందరిట్ల। సందియం బందుదురు, దాని సంశయంబు। తీరఁ దెలుపు, మిదియె నా తృతీయవరము (౨౧)॥ ౧౭

తే॥ గీ॥ దేవతలు సయితమిందు సందియముగాంచి, । రిది తెలియశక్యమే సూక్ష్మ, మింకదీని। విడిచి వేరొండువరమును వేఁడుమయ్య,। నాకు నిర్బంధ మొసఁగక నను విడుపుము (౨౨)॥ ౧౮

---

౧౯. త్రిణాచికేతస్త్రయమేతద్విదిత్వా య ఏవం విద్వాంశ్చినుతే నాచికేతమ్। స మృత్యుపాశాన్ పురతః ప్రణోద్య శోకాతిగో మోదతే స్వర్గలోకే ॥

(page text as printed:) యో వా ప్యేతాం బ్రహ్మజజ్ఞాత్మభూతాం. చితిం విదిత్వా చినుతే నాచికేతమ్। స ఏవ భూత్వా బ్రహ్మజజ్ఞాత్మభూతః కరోతి తద్యేన పునర్నజాయతే ॥

౨౦. ఏష తేఽగ్నిర్నచికేతః స్వర్గ్యో య మవృణీథా ద్వితీయేన వరేణ,। ఏత మగ్నిం తవైవ ప్రవక్ష్యన్తిజనాస, స్తృతీయం వరం నచికేతో వృణీష్వ ॥

౨౧. యేయం ప్రేతే విచికిత్సా మనుష్యే అస్తీత్యేకే నాయ మస్తీతి చైకే,। ఏతద్విద్యా మనుశిష్ట స్త్వయాహం, వరాణా మేష వర స్తృతీయః ॥

౨౨. దేవై రత్రాపి విచికిత్సితం పురా, న హి సువిజ్ఞేయ మణు రేష ధర్మః,। అన్యం వరం నచికేతో వృణీష్వ, మా మోపరోత్సీ రతి మా సృజైనమ్॥

తే॥గీ॥ దేవతలు సయిత మిందు సందియము నొంది, । రీది
తెలియశక్యమే యని యీవె యంటి, । వింక నిది
తెల్ప నాకొరుఁ డెవ్వఁడయ్యె, । యట్లు కావున నీ
వరం బసదృశంబు (౨౩) ॥ ౧౯

క॥ సుత పౌత్రుల వరియింపుము। శతాయువులఁ బెక్కు-
పశు గజ ధనాశ్వము లా।యతనము మహత్తరంబున్, ।
బ్రతుకుము నీవలయు వత్సరంబు లవనిలోన్ (౨౪) ॥

క॥ ఇతరమగు వరము దీనికిఁ । బ్రతిగాఁ గోరంగవచ్చు,
ద్రవ్యము చిరజీ । వితమును క్షితిలోన మహా ।
న్నత కామావాప్తి నిత్తు నచికేతుండా (౨౫) ॥ ౨౦

క॥ నరలోకంబున నేమే । వరములు దుర్లభము లవియు
వరియింపుము, సుం। దరుల నరదముల వాద్యో । త్క-
రముల, నివియొరులు పొందఁదరమే తలఁపన్ ॥ ౨౧

---

౨౩. దేవై రత్రాపి విచికిత్సితం కిల, త్వంచ మృత్యో యన్నసువిజ్ఞేయ మాత్థ, । వక్తా చాస్య త్వాదృగన్యో న లభ్యో, నాన్యో వర స్తుల్య ఏతస్య కశ్చిత్ ॥

౨౪. శతాయుషః పుత్రపౌత్రాన్ వృణీష్వ బహూన్ పశూన్ హస్తిహిరణ్య మశ్వాన్, । భూమే ర్మహదాయతనం వృణీష్వ, స్వయంచ జీవశరదో యావ దిచ్ఛసి ॥

౨౫. ఏతత్తుల్యం యది మన్యసే వరం వృణీష్వ విత్తం చిరజీవికాం చ, । మహాభూమౌ నచికేత స్త్వమేధి, కామానాం త్వా కామభాజం కరోమి ॥

౨౬. యే యే కామా దుర్లభా మర్త్యలోకే సర్వాన్ కామాం శ్ఛన్దతః ప్రార్థయస్వ, । ఇమా రామా స్సరథా స్సతూర్యా, నహీదృశా లమ్భనీయా మనుష్యైః, । ఆభిర్మత్ప్రత్తాభిః పరిచారయస్వ, నచికేతో మరణం

వ॥ పనాసంగునట్టి యింతులు మొదలగు । వానిచేత నీకు వలసినట్టి । పరిచరణము లంది పరితృప్తిఁగొను నచి । కేత, యడుగవలదు ప్రేతవిధము (౨౬) ॥ ౨౩

సీ॥ నేఁడుండి రేపు లేనివి యెల్ల యర్థంబు లిందియంబుల తేజ మెల్లఁ బీల్చు, । జీవితం బంతయు భావింప నల్పం బె, యోజీవితేశ యీవాజులు మఱి । నృత్తగీతములును నీకె యాఁగావుత, (౨౭) నర్థంబుచేఁ దృప్తుఁ డగునె నరుఁడు, । నినుఁగాంచువారికి ధనము దుర్లభ మె, నీవ ప్రభుత యుండెడుదాఁక బ్రతుకువాఁడ, (౨౮) ॥ సుజరుఁడ జరులఁ గని తదాస్థ గను టెట్లు, । వర్ణరతి మోదమున స్వభావంబు తెలిసి । బ్రతుకుఁ గోరునె, (౨౯) సంశయ పద మె తెల్పు, । కోరఁడీనచికేతుఁడ గూఢపదము (౩౦) ॥

---

మూను ప్రాక్తిః ॥

౨౬. శ్వోభావా మర్త్యస్య యదన్తకైతత్ సర్వేన్ద్రియాణాం జరయన్తి తేజః, । అపి సర్వం జీవిత మల్ప మేవ, తవైవ వాహా స్తవ నృత్తగీతే ॥

౨౭. న విత్తేన తర్పణీయో మనుష్యో, లప్స్యామహే విత్త మద్రాక్ష్మ చే త్త్వా, । జీవిష్యామో యావదీశిష్యసి త్వం, వరస్తు మే వరణీయ స్స ఏవ ॥

౨౮. అజీర్యతా మమృతానా ముపేత్య జీర్య న్మర్త్యః క్వధఃస్థః ప్రజానన్, । అభిధ్యాయన్ వర్ణరతి ప్రమోదా ననతిదీర్ఘే జీవితే కో రమేత ॥

౩౦. యస్మి న్నిదం విచికిత్సన్తి మృత్యో యత్సామ్పరాయే మహతి బ్రూహి నస్తత్, । యో యం వరో గూఢ మను ప్రవిష్టో నాన్యం తస్మా న్నచికేతా వృణీతే ॥

ఇతి ప్రథమవల్లీ.

తే॥ గీ॥ శ్రేయ మన నుండు, మఱి యుండుఁ బ్రేయ మనఁగ,। రెండు భిన్నార్థములు పట్టి యుండు నరుని, । శ్రేయ మును గోరువానిని జేరు మేలు, । ప్రేయముం గోరు వాఁడు లభించు హాని ॥ ౧

క॥ శ్రేయంబును బ్రేయంబును । నీయుభయము తెలిసి ధీరుఁ డేర్పఱుపవలెన్,। శ్రేయమె కోరుం ధీరుఁడు,। ప్రేయమె కోరున్ జడుఁ డుపభృతివృద్ధులకున్॥ ౨

క॥ నీవు ప్రియంబులఁ బ్రియాలం । భావించి త్యజించితివి, ఏవి నచికేతుండా । జీవు లనేకులు కని చెడు । నీ విత్తమయార్గళంబు నెడలితివి కడున్ ॥ ౩

తే॥ గీ॥ విద్యయును నవిద్య యని రెండు పద్య లిందుఁ। గలవు విపరీతములు విషూచులు నగుచును, । కేవలము వి ద్యయే నచికేత కోరి । తీవు, కోర్కులు నిను గెల్వ

---

౧. అన్యచ్ఛ్రేయోఽన్యదుతైవ ప్రేయ, స్తేఉభే నానార్థే పురుషగ్ం సినీతః, । తయోః శ్రేయ ఆదదానస్య సాధుభవతి, హీయతేఽర్థాద్య ఉ ప్రేయో వృణీతే ॥

౨. శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్య మేత స్తౌ సంపరీత్య వివినక్తి ధీరః, । శ్రేయోహి ధీరోఽభి ప్రేయసో వృణీతే, ప్రేయో మన్దో యోగక్షేమా ద్వృణీతే ॥

౩. సత్వం ప్రియాన్ ప్రియరూపాగ్ శ్చ కామా నభిధ్యాయన్నచికేతోఽత్యస్రాక్షీః,। నైతాగ్ం సృఙ్కాం విత్తమయీమవాప్తో యస్యాం మజ్జన్తి బహవో మనుష్యాః ॥

౪. దూరమేతే విపరీతే విషూచీ అవిద్యా యాచ విద్యేతి జ్ఞాతా, । విద్యాభీప్సినం నచికేతసం మన్యే, న త్వా

లేవు సుమ్ము ॥ ౪

తే॥గీ॥ పెక్కువారగ లవిద్యలోఁ జిక్కువడుచుఁ। దేశవిగలధీరు
ల మని భ్రాంతిని వహించి । తిరుగుచుందు రంధులఁ
గూడి యరుగు దెంచు । నంధులంబోలె మూఢులై
యందు నిందు ॥ ౫

క॥ ధన మోహమునఁ బ్రమాదం । బునఁ దగు బాలునకుఁ
దెలియఁబోలునె పర, మీ । కనులోక మె కలదనుకొ
ను।మనుజుఁడు నావశము మాటిమాటికిఁ జెందున్ ॥

క॥ వినలేరు పెక్కువారలు, । వినియుం దెలియంగలేరు,
విద్వద్గురుశా । సనమునఁ బరునిం గనుఁగొను । మ
నుజుఁ డరిది, తెలిసి పలుకుమనుజుఁడు నరుడౌన్ ॥ ౬

తే॥గీ॥ అవరమనుజుఁడు తెల్పంగ నసులభుండు । పలుదెఱం
గులఁ జింతింపఁబడిన నితఁడు, । గతి యనన్యోక్త

---

కామా బహవో లోలుపన్త ॥

౫. అవిద్యాయా మన్తరే వర్తమానాః స్వయంధీరాఃప
ణ్డితంమన్యమానాః । దన్ద్రమ్యమాణాః పరియన్తి మూ
ఢా అన్ధేనైవ నీయమానా యథాన్ధాః ॥

౬. నసామ్పరాయః ప్రతిభాతి బాలం ప్రమాద్యన్తం విత్త
మోహేనమూఢమ్,।అయంలోకో నాస్తిపర ఇతిమానీ
పునః పునర్వశ మాపద్యతే మే ॥

౭. శ్రవణాయాపి బహుభి ర్యో న లభ్యః,శృణ్వన్తోఽపి
బహవో యం న విద్యుః,। ఆశ్చర్యో వక్తా కుశలో
ఽస్య లబ్ధా, ఆశ్చర్యో జ్ఞాతా కుశలానుశిష్టః ॥

౮. న నరేణావరేణ ప్రోక్త ఏషసువిజ్ఞేయో బహుధా చి
న్త్యమానః, । అనన్యప్రోక్తే గతి రత్ర నాస్తి, అణీ

మగు నింమఁగలుగ, దప్రి తర్కజ్ఞఁ డణువులకు నణు
వితండు గాన॥

క॥ ఒరుఁడు తెలుపంగ నగు స । త్తరమిది ప్రియతమ, సుబుద్ధితరజ్ఞంబున దు । స్తర మీవంది తహాహాని । ర్భరధృతి, నీవంటి శిష్యుఁ బడయుదు మెపుడున్॥ ౯

క॥ ఏనెఱుఁగుదుఁ గర్మఫలం । బా నిధి యధ్రువము, నిత్య మధ్రువములచే । నౌనె యని నాచికేతా । ఖ్యానల చయనమునఁ గంటిఁగా నిత్యంబున్ ॥ ౧౦

క॥ క్రతుఫలజగదీప్సితసం । గతి కాదని సుప్రతిష్ఠ గలయ నవధియౌ । గతి నుతిఁ గనుఁగొనఁ దగినది । ధృతిఁ గాంక్షించితివి ధీరధీ నచికేతా ॥ ౧౧

ఆ॥ వె॥ కానరాని దేవు గహ్వరస్థుఁ బురాణు । గుహనెసంగు వాని గూఢు నతని । నవధరించి ధీరుఁ డధ్యాత్మయో

---

యాన్ హ్యతర్క్య మణు ప్రమాణాత్ ॥

౯. నైషా తర్కేణ మతి రాపనేయా ప్రోక్తాన్యేనైవ సుజ్ఞానాయ ప్రేష్ఠ,। యాం త్వ మాపః సత్యధృతి ర్బతాసి, త్వాదృ ఙ్నో భూయా న్నచికేతః ప్రష్టా ॥

౧౦. జానామ్యహగ్ం శేవధిరిత్యనిత్యం, నహ్యధ్రువైః ప్రాప్యతేహి ధ్రువం తత్,। తతో మయా నాచికేత శ్చితో ఽగ్ని,రనిత్యై ర్ద్రవ్యైః ప్రాప్తవానస్మి నిత్యమ్ ॥

౧౧ కామస్యాప్తిం జగతః ప్రతిష్ఠాం క్రతో రానన్త్య మభయస్య పారమ్ । స్తోమం మహదురుగాయం ప్రతిష్ఠాం దృష్ట్వా ధృత్యా ధీరో నచికేతోఽత్యస్రాక్షీః ॥

౧౨. తం దుర్దర్శం గూఢ మనుప్రవిష్టం గుహాహితం గహ్వరేష్ఠం పురాణమ్ । అధ్యాత్మయోగాధిగమేన దేవం

గాప్తిఁ । బొలిచి హర్షశోకములఁ ద్యజించు ॥ ౧౨

క॥ ఈ తెఱఁగు విని, తెలిసి ధ । ర్మేతరమున్ విడిచి య
ఖువు నీతనిఁ గని సం । ప్రీతి న్మర్త్యుఁడు కొను, న
చి । కేతునకే వివృత మీనికేతన వరయున్ ॥ ౧౩॥

క॥ ప్రేతపతీ ధర్మాధ । ర్మేతరమగు పదము మఱియుఁ గృత
ము నకృతమున్ । భూతము భవ్యము కానిది । నీ తె
లిసిన దాని నాకు నీవె తెలుపవే ॥ ౧౪

క॥ వేదంబు లన్నియును బ్రీతి । పాదించుం దేని నెది త
పములు తెలుపు నెం । దాదరము బ్రహ్మచర్యా । పాద
క మోమర్థ మట్టిపదము తెలుపుదున్ ॥ ౧౫

క॥ ఇదియే బ్రహ్మం బక్షర, । మిదియే యక్షర మగు పర,
మీయక్షరమే । విదితముగఁ జేసికొని యె । య్యది
యెవ్వఁడు కోరు వాని కది సిద్ధించున్ ॥ ౧౬

---

మత్వా ధీరో హర్షశోకౌ జహాతి ॥

౧౩. ఏతచ్ఛ్రుత్వా సంపరిగృహ్య మర్త్యః ప్రవృహ్య ధ
ర్మ్యమణు మేత మాప్య । సమోదతే మోదనీయగ్ హి
లబ్ధ్వా, వివృతగ్ సద్మ నచికేతసం మన్యే ॥

౧౪. అన్యత్ర ధర్మా దన్యత్రాధర్మా దన్యత్రాస్మా త్కృతా
కృతాత్ । అన్యత్ర భూతాచ్చ భవ్యాచ్చ యత్తత్ప
శ్యసి తద్వద ॥

౧౫. సర్వే వేదా యత్పద మామనన్తి తపాగ్ంసి సర్వా
ణిచ యద్వదన్తి । యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి త
త్తే పదగ్ సఙ్గ్రహేణ బ్రవీమ్యో మిత్యేతత్ ॥

౧౬. ఏతద్ధ్యేవాక్షరం బ్రహ్మ, ఏతద్ధ్యేవాక్షరం పరమ్, । ఏత
ద్ధ్యేవాక్షరం జ్ఞాత్వా యో యదిచ్ఛతి తస్య తత్ ॥

క॥ ఇది శ్రేష్ఠాలంబన మగు,। నిదియే యాలంబన మగు
నెంతయుఁ బరమి। ట్టిది యాలంబన మనుచున్ । మ
దిఁ దెలిసిన బ్రహ్మలోక మహితుఁ డతఁడగున్॥ ౧౭

తే॥గీ॥ పుట్టఁ డీతఁడు చావండు బుద్ధిమంతుఁ । డొకనివలనఁ
గలిగి మఱియొకఁడుకాక । యజుఁడు నిత్యుఁడు శా
శ్వతుం డగుపురాణుఁ । డంగము నిహతమైన నిహ
తుఁడు కాఁడు ॥ ౧౮

తే॥గీ॥ చంపెద నటంచు నొరుఁ డొరుఁ జంపఁజూచు, । నొ
రుఁడు నను జంపు నని మఱియొకఁడు తలఁచు,। వా
రలిరువురు నెఱుఁగనివారె తలఁపఁ, । జంపఁ డాతఁ
డితండును జంపఁ బడఁడు ॥ ౧౯

తే॥గీ॥ అణువు కంటె నణువును, మహత్తు కంటె । నగు మ
హా, త్మాత్మ ప్రాణిగుహానిహితుఁడు । ధాతుప్రసా
దమున నాత్మమహిమ మగు । నతని వీతశోకుఁడు కను
నక్రతుండు ॥ ౨౦

---

౧౭. ఏతదాలమ్బనగ్ శ్రేష్ఠ, మేతదాలమ్బనంపరమ్, । ఏ
తదాలమ్బనం జ్ఞాత్వా బ్రహ్మలోకే మహీయతే ॥

౧౮. న జాయతే మ్రియతే వా విపశ్చి న్నాయం కుతశ్చి
న్న బభూవ కశ్చిత్ । అజో నిత్య శ్శాశ్వతోఽయం
పురాణో న హన్యతే హన్యమానే శరీరే ॥

౧౯. హన్తా చేన్మన్యతే హన్తుగ్, హతశ్చే న్మన్యతే హతమ్,।
ఉభౌ తౌ న విజానీతో, నాయగ్ హన్తి న హన్యతే॥

౨౦. అణో రణీయా, న్మహతో మహీయా, నాత్మాస్య జ
న్తో ర్నిహితో గుహాయామ్,। తమక్రతుః పశ్యతి వీత
శోకో ధాతుః ప్రసాదా న్మహిమాన మాత్మనః॥

తే॥గీ॥ పోవుఁ గూర్చుండియును దూరమునకు నతండు, । శయన మొనరించు చెల్లెడ సంచరించు,। మదము నమదముఁ గలిగి యమరిన దేవు । నెవ్వఁడు మదన్యుఁ డాతని నెఱుఁగ నేర్చు ॥ ౨౧

క॥ తను రహితుండై తనువుల । ననవస్థములైన వాని యందుండు మహా। త్మను విభువగువానిఁ దలఁ।చు నతఁడు ధీరుండు కనఁడు శోకము నెపుడున్ ॥ ౨౨

క॥ కొనరాఁ డాత్మ ప్రవచనం । బున నైనన్ మేధనైన భూరియగు శ్రుతం ।, బున, నాతఁ డెవనివరియిం । చునో యతనికె సులభుఁ డగుచుఁ జూపును దన్నున్ ॥

క॥ విడువక దుశ్చరితంబుల। నడఁపక చిత్తంబు నింద్రియంబులు మదిలో । నుడుగక చలనము బ్రహ్మము । పడయు టరిది, పడయవలయుఁ బ్రజ్ఞానము చేన్ ॥ ౨౪

క॥ చను బ్రహ్మము క్షత్రము నో । దనంబులై మృత్యువుం బిదపఁ దానుపసే। చన మెవ్వనికై తగు నా।త

---

౨౧. ఆసీనో దూరం వ్రజతి, శయానో యాతి సర్వతః, । కస్తం మదామదం దేవం మదన్యో జ్ఞాతు మర్హతి ॥

౨౨. అశరీరగ్ శరీరే ష్వనవస్థే ష్వవస్థితమ్ । మహాన్తం విభు మాత్మానం మత్వా ధీరో న శోచతి ॥

౨౩. నాయమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన,। య మేవైష వృణుతే తేన లభ్య స్తస్యైష ఆత్మా వివృణుతే తనూగ్ స్వామ్ ॥

౨౪. నావిరతో దుశ్చరితా న్నాశాన్తో నాసమాహితః । నాశాన్తమానసో వాపి ప్రజ్ఞానేనైన మాప్నుయాత్ ॥

౨౫. యస్య బ్రహ్మ చ క్షత్రం చ ఉభే భవత ఓదనః ।

ని యిత్థంభావ మరయఁ దర మెవ్వరికిన్ ॥ ౨౫

---

తే॥గీ॥ ఋతము సుకృతము ద్రావుచు నిందు గుహలఁ। జొ
చ్చి పరమ పరార్థ్యమౌ చో నిరువుర। నుండువా
రల బ్రహ్మజ్ఞు లెండనీడ। లందురు, త్రిణాచికేత పం
చాగ్నులట్లు (౧) ॥ ౧

తే॥గీ॥ యజ్వలకు సేతు వెయ్యది యక్షరంబు । పరము బ్ర
హ్మంబు మఱి పారగరణ కాము । లైనవారికి నభ
యమౌ దాని నాచికేతము భజింప నగుదుము కృతు
లమేము (౨) ॥ ౨

సీ॥ ఆత్మ రథి, శరీర మగు స్యందనము, బుద్ధి క్షత్త, మనం
బు పగ్గ మగుచుండు,(౩)। నింద్రియంబులె యగుఁ బైన
హాయములు, శబ్దాదు లందు గోచరతఁ గాంచు,। మన
ము నింద్రియములు తనతోడఁ గూడంగ నాత్మభోక్త

---

మృత్యు ర్యస్యోపసేచనం క ఇత్థా వేద యత్ర సః ॥

ఇతిద్వితీయావల్లీ.

౧. ఋతం పిబన్తౌ సుకృతస్య లోకే గుహాం ప్రవిష్టౌ ప
రమే పరార్ధ్యే । ఛాయాతపౌ బ్రహ్మవిదో వదన్తి, ప
ఞ్చాగ్నయో యేచ త్రిణాచికేతాః ॥

౨. యస్సేతురీజానానా మక్షరం బ్రహ్మ యత్పరమ్ ।
అభయం తితీర్షతాం పారం నాచికేతగ్ం శకేమహి ॥

౩. ఆత్మానగ్ం రథినం విద్ధి, శరీరగ్ం రథ మేవ తు, । బు
ద్ధింతు సారథిం విద్ధి, మనః ప్రగ్రహ మేవచ ॥

౪. ఇన్ద్రియాణి హయా నాహు, ర్విషయాగ్ం స్తేషు గో
చరాన్,। ఆత్మేన్ద్రియ మనో యుక్తం భోక్తేత్యాహు

యటంచునందు బుధులు, (౪)। మన మయుక్తమగు నె
వ్వని, కవిజ్ఞానుఁడౌ, వాని కింద్రియము లవశ్యములగు॥
సాటి యాతఁడు దుష్టాశ్వ సారథికగు, (౫)। మానసము
యుక్త మగుట విజ్ఞానముగల। వానికింద్రియములు క
డు వశ్యములగు, । సాటి వానికి సౌమ్యాశ్వ సారథి
యగు (౬) ౩

తే।గీ॥ అగు నవిజ్ఞానుఁ డమనస్కుఁ డశుచి యెవ్వఁ।డతఁడు
సంసృతిగామి దివ్యపద మెట్లు। కాంచు, (౭) సన్మా
నసుండు విజ్ఞాన శాలి। శుచి పునర్భవరహిత మౌ చో
టుఁగాంచు (౮)॥ ౪

తే।గీ॥ సాధు విజ్ఞాన మెవనికి సారథి యగు,।మానసము ప్ర
గ్రహంబగు, మనుజుఁ డతఁడు। ప్రబల సంసార
మార్గ పారంబుఁ జేందు;। నదియె పరమమౌ విష్ణుని ప
దమనఁబడు (౯)॥ ౫

---

ర్మనీషిణః ।

౫. యస్త్వ విజ్ఞానవాన్భవ త్యయుక్తేన మనసా సదా।
తస్యేన్ద్రియాణ్యవశ్యాని, దుష్టాశ్వా ఇవ సారథేః॥

౬. యస్తు విజ్ఞానవాన్భవతి యుక్తేన మనసా సదా।
తస్యేన్ద్రియాణి వశ్యాని, సదశ్వా ఇవ సారథేః॥

౭. య స్త్వవిజ్ఞానవాన్ భవ త్యమనస్క స్సదాఽశుచిః।
న స తత్పద మాప్నోతి, సంసారం చాధిగచ్ఛతి॥

౮. యస్తు విజ్ఞానవాన్భవతి సమనస్క స్సదా శుచిః। స
తు తత్పద మాప్నోతి యస్మా ద్భూయో న జాయతే॥

౯. విజ్ఞాన సారథి ర్యస్తు మనః ప్రగ్రహవాన్ నరః।
సోఽధ్వనః పార మాప్నోతి తద్విష్ణోః పరమం
పదమ్॥

తే॥గీ॥ పరము లర్థము లింద్రియ ప్రతతి, కర్థ। ములపయి మనంబు, దానిపై బుద్ధి, దాని। పయి మహాత్మ (౧౦) యవ్యక్తమాపయిని, దాని। పయిఁ బురుషుఁడగుఁ బరకాష్ఠ పరగతియును (౧౧)॥

తే॥గీ॥ అఖిల భూతములందుఁ దా నాత్మ గూఢుఁ। డగుట మనరుఁ బ్రకాశింపఁడగ్ర్యమైన। సూక్ష్మమగు బుద్ధిచేతను సూక్ష్మదర్శు। లది కనుంగొనుచుందు రత్యాదరమున (౧౨)॥

కం॥ మానసమున వాకును, మఱి। దానిన్ జ్ఞానాత్మయందు, దాని మహాత్మ। స్థానంబున, శాన్తాత్మ। స్థానంబున దాని నట్ల చను నియమింపన్ (౧౩)॥

కం॥ నరులార లెండు మేల్కాని,। వరులవలనఁ దెలియవలయు వర్తనియిదియుర్, । క్షురధారయట్లు నిశిత

---

౧౦. ఇన్ద్రియేభ్యః పరా హ్యర్థా, అర్థేభ్యశ్చ పరం మనః,। మనసశ్చ పరా బుద్ధి, ర్బుద్ధే రాత్మా మహా న్పరః, ॥

౧౧. మహతః పర మవ్యక్త, మవ్యక్తా త్పురుషః పరః। పురుషా న్న పరం కించి త్సా కాష్ఠా సా పరాగతిః,॥

౧౨. ఏష సర్వేషు భూతేషు గూఢోత్మా న ప్రకాశతే। దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః ॥

౧౩. యచ్ఛే ద్వాఙ్మనసి ప్రాజ్ఞ, స్తద్యచ్ఛే జ్ఞాన ఆత్మని,। జ్ఞాన మాత్మని మహతి నియచ్ఛే, త్తద్యచ్ఛే చ్ఛాన్త ఆత్మని ॥

౧౪. ఉత్తిష్ఠత జాగ్రత ప్రాప్య వరాన్నిబోధత,। క్షుర

ము|దురత్యయం బండ్రు కవులు దుర్గంబనియున్ (౧౪)

ఆ॥వె॥ స్పర్శ గన్ధ రూప శబ్ద రస వ్యయా । న్త్యాది శూన్య మ
ది మహత్పరంబు।నిత్యమును ధ్రువంబు నెవ్వది ధ్యా
నింప।మృత్యు ముఖమునుండి యెడలఁ జేయు (౧౫)॥

కం॥ ఈనాచికేతసూపా। ఖ్యానంబు సనాతనంబు యముఁ
డు వచించెన్,।దీని విన నుడువ బ్రహ్మ । స్థానంబున
మహితుఁడగు విచక్షణుఁ డెపుడున్ (౧౬)॥ ౧౧

కం॥ పరమము గోప్యం బగుచుఁ । బరగెడు నిద్దాని నెవఁ
డు బ్రాహ్మణ సభలోఁ।బరిశుద్ధ శ్రాద్ధాద్యవ। సర
ములవినిపించు నతఁడు సత్ఫల మొందున్ (౧౭)॥ ౧౨

---

స్య ధారా నిశితా దురత్యయా దుర్గం పథ స్తత్కవ
యో వదన్తి ॥

౧౫. అశబ్ద మస్పర్శ మరూప మవ్యయం తథా రసం నిత్య
మగన్ధవచ్చ యత్। అనా ద్యనన్తం మహతః పరం ధ్రు
వం నిచాయ్య తం మృత్యుముఖా త్ప్రముచ్యతే ॥

౧౬. నాచికేత ముపాఖ్యానం మృత్యుప్రోక్తగ్ం సనాతనమ్।
ఉక్త్వా శ్రుత్వాచ మేధావీ బ్రహ్మలోకే మహీయతే ॥

౧౭. యఇమం పరమం గుహ్యం శ్రావయేద్బ్రహ్మసంస
ది। ప్రయతశ్శ్రాద్ధకాలేవా తదానన్త్యాయకల్పతే
తదానన్త్యాయకల్పత ఇతి ॥

ఇతితృతీయావల్లీ

ఇతిప్రథమోఽధ్యాయః

తే॥గీ॥ వెలి మొగంబులు గాఁ జేసె నలువ యింద్రి । యములఁ, గావున వెలిచూచు, నంతరాత్మఁ । గానలే వవి, వాని నొకానొకండు । ధీరుఁ డమృతార్థి లోనికిఁ ద్రిప్పి చూచు ॥ ౧

కం॥ వెలుపలి కామంబులకై । మెలగెడు బాలు రెనయుదురు మృత్యువు వలలో । పల, ధీరులు ధ్రువమధ్రువ। ములఁ దెలియుచు నమృతతఁ గని పోరందులకున్ ॥ ౨

కం॥ మనుజుఁడు శబ్దము రూపం । బును స్పర్శము గంధము రసమును మైథునముల్ । మునుకొని తెలియుట యే సా । ధనమున నందేమి కొదువ, తానిది యదియే ॥ ౩

కం॥ కనుఁగొనుఁ దన స్వప్నాంతం । బును జాగరితావసానమును నెవ్వని సా । ధనమున నావిభుని మహా। త్మ నెఱిఁగి ధీరుండు గనఁడు తా శోకంబున్ ॥ ౪

---

౧. పరాఞ్చి ఖాని వ్యతృణత్స్వయంభూస్తస్మాత్పరాఙ్పశ్యతి నాన్తరాత్మన్। కశ్చిద్ధీరః ప్రత్యగాత్మానమైక్షదావృత్తచక్షురమృతత్వమిచ్ఛన్ ॥

౨. పరాచః కామాననుయన్తి బాలాస్తే మృత్యోర్యన్తి వితతస్య పాశమ్।అథ ధీరా అమృతత్వం విదిత్వా ధ్రువమధ్రువేష్విహ న ప్రార్థయన్తే ॥

౩. యేన రూపం రసం గన్ధం శబ్దాన్ స్పర్శాంశ్చ మైథునాన్। ఏతేనైవ విజానాతి కిమత్ర పరిశిష్యతే॥ ఏతద్వై తత్ ॥

౪. స్వప్నాన్తం జాగరితాన్తం చోభౌ యేనానుపశ్యతి । మహాన్తం విభుమాత్మానం మత్వా ధీరో న శోచతి ॥

కం॥ మునుకొనీ మధుర ఫలంబులు । తిను జీవుని నికటమున నతీతాగామీ । శునిఁ దెలిసినవాఁడు జుగు । ప్సను జెందంజాలఁడు పదపడి, యిది యదియే ॥ ౫

కం॥ మును తపమున నేకార్ణవ । మున నెవ్వఁడు పుట్టి సకల భూతంబులతో । డనె గుహలోఁ జొచ్చి వసిం । చెనతనిఁ గనె నెయ్యది, యది చెప్పఁగ నిదియే ॥ ౬

కం॥ ఉదితమగు దేవమయి యౌ । య్యది ప్రాణముతోడనే గుహం జొరఁబడి య । న్నది భూతంబులతో న । య్యదితివిశిథజాత తెలియ నది యిదియె యగున్ ॥ ౭

ఆ॥వె॥ గర్భిణులు ధరించు గర్భంబు కరణినే । యరణులందు నిహిత మగుచు మేలు । కనిన యోగిశీలు రనుదినము నుతింప । నమరు నగ్నిమెద్దియద్ది యిదియె ॥ ౮

---

౫. య ఇమం మధ్వదం వేద ఆత్మానం జీవ మన్తికాత్ । ఈశానం భూతభవ్యస్య న తతో విజుగుప్సతే॥ ఏతద్వై తత్ ॥

౬. యః పూర్వం తపసో జాత మద్భ్యః పూర్వ మజాయత । గుహాం ప్రవిశ్య తిష్ఠన్తం యో భూతేభి ర్వ్యపశ్యత ॥ ఏతద్వైతత్ ॥

౭. యా ప్రాణేన సంభవ త్యదితి ర్దేవతామయీ। గుహాం ప్రవిశ్య తిష్ఠన్తీ యా భూతేభి ర్వ్యజాయత ॥ ఏతద్వై తత్ ॥

౮. అరణ్యో ర్నిహితో జాతవేదా గర్భ ఇవ సుభృతో గర్భిణీభిః। దివే దివ ఈడ్యో జాగృవద్భి ర్హవిష్మద్భి ర్మనుష్యేభి రగ్నిః ॥ ఏతద్వై తత్ ॥

కం॥ ఎందు నుదయించు సూర్యుం। డెం దస్తమయంబుఁ జెందు నెందే జేజే। లందరు నర్పితులై యుం। పొందిరియది దాట నెవ్వఁ డోపు, నది యిదే ॥ ౯

కం॥ కల దెయ్యది యిందందుం। గల దది, గల దందు నెద్ది గల దది యిందున్। పలువిధములఁ జూచెడి వాఁ। డలమృత్యువునుండి మృత్యు వందుచు నుండున్॥ ౧౦

కం॥ తెలియందగు మనమున నే : పలుతెఱఁగులు లేవటంచుఁ, బలుతెఱఁగులు గాఁ,దలఁచెడువాఁ డెవ్వఁ డతం। డలమృత్యువునుండి మృత్యువందుచు నుండున్ ॥

తే॥గీ॥ అంగుటం బంత పురుషుఁడె యాత్మ మధ్య। మున వసింపుచున్నాఁడు భూత భవ్య। ములకు నీశ్వరుఁ డాతనిఁ దెలిసిన పయిఁ। గలుగదు జుగుప్స, యదె యిదిగాఁ దెలియుము ॥ ౧౨

కం॥ పొగ లేని యగ్ని వోలెం। దగు నంగుటమంత పరిమితముగా బురుషుం। డగు భూతభవ్యపతి, నే। డగు

---

౯. యత శ్చోదేతి సూర్యో అస్తం యత్ర చ గచ్ఛతి। తం దేవా స్సర్వే ర్పితా స్తదు నాత్యేతి కశ్చన ॥ ఏత ద్వై తత్ ॥

౧౦. య దేవేహ తదముత్ర య దముత్ర త దన్విహ। మృత్యోస్స మృత్యు మాప్నోతి యఇహ నానేవపశ్యతి॥

౧౧. మనసై వేద మాప్తవ్యం నేహ నానా ఽస్తికించన! మృత్యోస్స మృత్యుం గచ్ఛతి యఇహ నానేవ పశ్యతి॥

౧౨. అఙ్గుష్ఠమాత్రః పురుషో మధ్య ఆత్మని తిష్ఠతి। ఈశానో భూతభవ్యస్య నతతో విజుగుప్సతే॥ఏత ద్వై తత్॥

౧౩. అఙ్గుష్ఠమాత్రః పురుషో జ్యోతి రి వాధూమకః। ఈ

రేపు నతండె తెలియ నది యిదియె యగున్ ॥ ౧౩

ఆ॥ వె॥ దుర్గమందుఁ గురియు తోయంబు పర్వంత । పర్వ
తములయందుఁ బర్వునట్లు । పలువిధముల ధర్మముల
ను దలంచువాఁ । డట్లె పలు తెఱంగు లందుచుండు ॥

కం॥ జలము విమలంబు నిర్మల । జలముల నునిచినది దాని
సదృశంబె యగున్, । తెలిసిన మునివరునకు న । ట్టు
లెయగు గౌతముఁడ! జీవుఁడు న్పరమానితోన్ ॥౧౫

---

తే॥గీ॥ ఋజు మనము గల యజునకు నీమెయి యగుఁ । బ
దునొకండు ద్వారంబుల పత్తనంబు, । ధ్యానమున
శోకము త్యజించి దీని విడుచు।నతఁడు ముక్తుఁడె యగు,
నిది యదియె సుమ్ము ॥ ౧

తే॥గీ॥ హంస మతిథి వసువు హోత యాకసమున। గృహ
మునన్ వేది నరులందు ఋతవరముల । దివిని శుచి
నిచ్చనీటిలో భువిని గిరుల । ఋతమునం బుట్టు బ

---

శానో భూతభవ్యస్య సపవాద్యసడుశ్వః॥ ఏతద్వైతత్ ॥

౧౪. యథోదకం దుర్గే వృష్టం పర్వతేషు విధావతి । ఏ
వం ధర్మాన్ పృథక్ పశ్యం స్తా నేవాను విధావతి ॥

౧౫. యథోదకం శుద్ధే శుద్ధ మాసిక్తం తా దృగేవ భవ
తి । ఏవం మునే ర్విజానత ఆత్మా భవతి గౌతమ ॥

ఇతి చతుర్థవల్లీ.

౧. పుర మేకాదశద్వార మజ స్యావక్రచేతసః । అను
ష్ఠాయ న శోచతి విముక్తశ్చ విముచ్యతే॥ ఏతద్వైతత్ ॥

౨. హంస శ్శుచిష ద్వసు రన్తరిక్షసద్ధోతా వేదిష దతిథి ర్దు
రోణసత్ । నృష ద్వరస దృతస ద్వ్యోమ సదబ్జా

హ్మముబుతము సుమ్ము ॥ ౨

కం॥ లోనుండి పైకిఁ బ్రాణ మ । పానము పైనుండిలో
ని కట్టు నడుపుఁ దా। నానడుమ వామనుండా। సీ
నుండో, వాని సేవ సేతురు దేవుల్ ॥ ౩

ఆ॥ వె॥ మేనునందునుండి మెఱయుచు నీమేను । సడలుచున్న
యపుడు విడిచి పోవుఁ, । బ్రాణికిందు నెద్ది నద్రిల్లుఁ
బరిశిష్ట । మగుచు, నెన్న నిద్ది యదియె సుమ్ము ॥ ౪

ఆ॥ వె॥ ప్రాణమున నె నరుఁడు బ్రతుకఁడు, దలఁప న । పా
నమునను నరుఁడు బ్రతుకఁ, డిట్టి । రెండు నెవనిఁ జే
రి యుండు నాపరునిచే । బ్రతుకు ననుట మంచి ప
లుకు సుమ్ము ॥ ౫

కం॥ మరణంబు కలుగు నప్పుడు । పరమున నీయాత్మ యె
ట్లు పరఁగునో, యకటా । తిరముగఁ బలికెద గౌత
మ । పరమరహస్యంబు ధ్రువము బ్రహ్మము దానిన్ ॥

కం॥ మేనులఁ బడయఁగఁ గొందరు। యోనులఁ జెందంగఁ
బోవుచుందురు, కర్మ । జ్ఞానానుసారమున నతి । హీ

---

గోజా ఋతజా అద్రిజా ఋతం బృహత్ ॥

౩. ఊర్ధ్వం ప్రాణ మున్నయ త్యపానం ప్రత్యగస్యతి ।
మధ్యే వామన మాసీనం విశ్వేదేవా ఉపాసతే ॥

౪. అస్య విస్రంసమానస్య శరీరస్థస్య దేహినః । దేహా
ద్విముచ్యమానస్య కిమత్ర పరిశిష్యతే॥ ఏత ద్వై తత్॥

౫. న ప్రాణేన నాపానేన మర్త్యో జీవతి కశ్చన । ఇ
తరేణతు జీవన్తి యస్మి న్నేతా వుపాశ్రితౌ ॥

౬. హన్త త ఇదం ప్రవక్ష్యామి గుహ్యం బ్రహ్మ సనాతన
మ్। యథా చ మరణం ప్రాప్య ఆత్మా భవతి గౌతమ ॥

౭. యోని మన్యే ప్రపద్యన్తే శరీరత్వాయ దేహినః ।

న స్థావరతఁ గాంతు రీగతి నితరుల్ ॥ ౭

ఉ॥ పంచజనాళికిం నిదురపట్టిన యప్పుడు పూరుషుండు మే । ల్కాంచుచుఁ గోరి కోరి పరికల్పన చేయుచు నుండు, వాఁడె య । త్యంచిత లోకధారకుఁడు బ్రహ్మము వాఁ డమృతంబు శుక్రమున్ । మించిన దెద్ది యాపదము మీఁద దలంపఁగ నిద్ది యద్దియే ॥ ౮

తే॥గీ॥ అగ్ని యొక్కఁడె జగతి నందందుఁ, జేరి । రూపు రూపునకుం బ్రతిరూపమయ్యె, । నట్లు సర్వాన్తరాత్మ బాహ్యమున నుండి । రూపురూపునకుం బ్రతిరూపమయ్యె ॥ ౯

తే॥గీ॥ అనిలుఁ డొక్కఁడె జగతి నందందుఁ జేరి । రూపు రూపునకుం బ్రతిరూపమయ్యె । నట్లు సర్వాన్తరాత్మ బాహ్యమున నుండి । రూపు రూపునకుం బ్రతిరూపమయ్యె ॥ ౧౦

---

స్థాణు మన్యేఽనుసంయన్తి యథాకర్మ యథాశ్రుతమ్॥

౮. య ఏష సుప్తేషు జాగర్తి కామంకామం పురుషో నిర్మిమాణః । త దేవ శుక్రం తద్బ్రహ్మ త దేవామృత ముచ్యతే । తస్మిన్ల్లోకాః శ్రితాః సర్వే తదు నాత్యేతి కశ్చన ॥ ఏతద్వై తత్ ॥

౯. అగ్ని ర్యథైకో భువనం ప్రవిష్టో రూపం రూపం ప్రతిరూపో బభూవ । ఏక స్తథా సర్వభూతాన్తరాత్మా రూపంరూపం ప్రతిరూపో బహిశ్చ ॥

౧౦. వాయు ర్యథైకో భువనం ప్రవిష్టో రూపం రూపం ప్రతిరూపో బభూవ । ఏక స్తథా సర్వ భూతాన్తరాత్మా రూపం రూపం ప్రతిరూపో బహిశ్చ ॥

తే॥గీ॥ అఖిల లోక లోచన గతుఁ డరుణుఁ డెట్లు। బా
హ్య చాక్షుష దోష లేపము నెనయఁడు,। లోక
ముల కతఁ డొకఁ డట్లు లోన నుండి। బాహ్యుఁడై
లోక దుఃఖ లేపముఁ బడయఁడు ॥ ౧౧

తే॥గీ॥ అతఁడు వశి యొక్కఁ డఖిలభూతాన్తరాత్మ,। బీ
జ మొక్కటి యొనరించుఁ బెక్కుగతులఁ,। గలఁడు
లోనె యతం, డని తెలియు ధీరు। లందుదురు నిత్య
సుఖ, మది యంద రొరులు ॥ ౧౨

చం॥ కలఁడొక నిత్యచేతనుఁడు కామము *లాతఁడు నిత్యు
లౌననే। కులు నగు నెల్లచేతనులకున్ ఘటియింపు
చు నున్నవాఁడు లోఁ। గలఁడతఁ డంచు నిశ్చయము
కల్గిన ధీరులకే పొసంగు మం। గళమగు నిత్యశాంతి, య
ది కల్గమ తక్కిన వారి కెప్పుడున్ ॥ ౧౩

కం॥ అదె యిది యని నిర్దేశా। స్పదంబు కాకుండు సు

---

౧౧. సూర్యో యథా సర్వలోకస్య చక్షుర్న లిప్యతే చా
క్షుషై ర్బాహ్యదోషైః। ఏక స్తథా సర్వభూతాన్త
రాత్మా న లిప్యతే లోకదుఃఖేన బాహ్యః॥

౧౨. ఏకో వశీ సర్వభూతాన్తరాత్మా ఏకం బీజం బహుధా
యః కరోతి। త మాత్మస్థం యేఽనుపశ్యన్తి ధీరా స్తే
షాం సుఖం శాశ్వతం నేతరేషామ్॥

౧౩. †నిత్యో నిత్యానాం చేతన శ్చేతనానా మేకో బ
హూనాం యో విదధాతి కామాన్। త మాత్మస్థం యే
ఽనుపశ్యన్తి ధీరా స్తేషాం శాన్తి శ్శాశ్వతీ నేతరే
షామ్॥

౧౪. త దేత దితి మన్యన్తేఽనిర్దేశ్యం పరమం సుఖమ్। కథ

---

*'అతఁడనిత్యులు' = †'నిత్యోఽనిత్యానామ్' అని శంకరమత పాఠము

ఖము చక్కఁగ భావిం । చెద రది వెలుఁగునో వెలుఁ
గదా । మదిలో నే నద్ది తెలియు మార్గము కలదే ॥

తే॥గీ॥ ఆతని వెలుంగు పై వెల్గఁ డరుకఁ డట్ల । యిందువు
ను జిక్కలు మెఱుంగు లెట్టులగ్ని, । వాని వెలుఁగు
వెంబడినె సర్వము వెలుంగు। వాని వెలుఁగున వెలుఁ
గు సర్వంబు లివ్వి ॥ ౧౫

---

తే॥గీ॥ కలదు పయి వేరు క్రింద కొమ్మలుగ రావి, । యది స
నాతన మదియె బ్రహ్మ మదె శుక్ర । మమృత మఖిల
లోకాశ్రియం బదియె,దాని । నెవ్వఁడును మీఱఁ
గాఁ జాలఁ,డిదియె యద్ది ॥ ౧

కం॥ పొడగను నదెల్ల నిందే । వెడలున్ బ్రాణమునఁ గ
దలుఁ,బిడుగెత్తిన క్రై । వడి దీనిఁ గాంచు భ
యం। పడు,దీనిం దెలియువారి పద మమృత మ
గున్ ॥ ౨

---

న్మ తద్విజానీయాం కిము భాతి విభాతి వా ॥

౧౫. న తత్ర సూర్యో భాతి న చన్ద్రతారకం నేమా వి
ద్యుతో భాన్తి కుతో ఽయ మగ్నిః । త మేవ భాన్త
మనుభాతి సర్వం తస్య భాసా సర్వ మిదం విభాతి ॥

ఇతిపఞ్చమావల్లీ

౧. ఊర్ధ్వమూలో అవాక్ శాఖ ఏషోశ్వత్థ స్సనాతనః। త
దేవ శుక్రం తద్బ్రహ్మ తదేవామృత ముచ్యతే। తస్మిల్లో
కాః శ్రితా స్సర్వే తదు నాత్యేతి కశ్చన॥ఏతద్వైతత్

౨. యదిదం కించ జగత్సర్వం ప్రాణ ఏజతి నిస్సృతమ్।
మహద్భయం వజ్ర ముద్యతం య ఏత ద్విదు రమృ
తా స్తే భవన్తి ॥

ఆ॥ వె॥ పావకుఁడు తపించు భానుండు నట్టుల। పాకశాసనుం
డుపవనుఁ డట్ల। దండధరుఁడు నట్ల తమతమ పనుల
లోఁ। బాఱుచుందు రతని భయము వలన॥ 3

కం॥ తన తను వెడలక మున్నే। జనుఁ డీతత్త్వంబుఁ దె
లియఁ జాలం డైనన్। గనఁబడు లోకములందె। ల్ల
ను దనువులఁ గాంచుచుండు లాఘవము మెయిన్॥ ౪

తే॥ గీ॥ ఎట్ల యాదర్శమం దాత్మ నట్ల, కలల। యందు నె
ట్లట్ల పితృలోకమందు, నీట। నెట్ల గంధర్వ లోకమం
దట్ల, యెండ। నీడలకు నట్ల, ధాతృని నెలవునందె॥ ౫

ఆ॥ వె॥ వేఱుగాఁగ నుద్భవించు నింద్రియములు। వేఱువేఱు
లగుట విశద రీతి। నుదయ మస్తమయము నొప్పఁగా
గీక్షించి। తెలియు ధీరు శోక మొలయ దెపుడు॥ ౬

మ॥ పరమా మానస మింద్రియంబులకు, నాపై సత్త్వ

---

౩. భయాదస్యాగ్ని స్తపతి భయా త్తపతి సూర్యః।
భయాదిన్ద్రశ్చ వాయుశ్చ మృత్యుర్ధావతి ప
ఞ్చమః॥

౪. ఇహ చే దశక ద్బోద్ధుం ప్రాక్శరీరస్య విస్రసః। త
త స్సర్గేషు లోకేషు శరీరత్వాయ కల్పతే॥

౫. యథాదర్శే తథాత్మని యథాస్వప్నే తథాపితృలో
కే। యథాప్సు పరీవ దదృశే తథా గన్ధర్వలోకే ఛా
యాతపయోరివ బ్రహ్మలోకే॥

౬. ఇన్ద్రియాణాం పృథగ్భావ ముదయాస్తమయౌ చ
యత్। పృథగుత్పద్యమానానాం మత్వా ధీరో న శో
చతి॥

౭. ఇన్ద్రియేభ్యః పరం మనో మనస స్సత్త్వముత్తమమ్। స
త్త్వా దధి మహానాత్మా మహతోఽవ్యక్తముత్తమమ్॥

మింపారుఁ, గ। త్పరమం దాత్మ మహాత్తు, మీఁలున మహత్తత్త్వంబు నవ్యక్తమున్, (౭)। పరుఁ డవ్యక్తము కంటెఁ బూరుషుఁడు తా వ్యాపించు నిర్లింగుఁ, డా। పరు తత్త్వంబు నెఱుంగువాఁ డమృతముం బ్రాపించెడి ముక్తుఁడై (౮)॥ ౭

ఆ॥ వె॥ ఇతని రూపు కంటి కెదురుగా నిలువదు, । కంట నెవఁడు నితనిఁ గానఁజాలఁ, । డెదను బ్రదలకుండ మది నీతఁ డెఱుఁగనౌ, । నిది యెఱుంగు వారలే యమృతులు (౯)॥ ౮

కం॥ మానసముతోడ నైదగు । జ్ఞానేంద్రియములును బుద్ధి కదలక యెందున్ । ధ్యానింప నగునొ దానినె। మానిత పరమగతి యండ్రు మానులు జగతిన్ (౧౦)॥ ౯

కం॥ ఈరీతి దృఢతరేంద్రియ । ధారణ యోగమని యండ్రు, దానికి జనిసం । హారములు ప్రమత్తత చే । నౌరెకు నగు, గాన నందు జాగ్రత్త తగున్ (౧౧)॥ ౧౦

---

౮. అవ్యక్తాత్తు పరః పురుషో వ్యాపకోఽలిఙ్గ ఏవ చ। యజ్జ్ఞాత్వా ముచ్యతే జన్తు రమృతత్వం చ గచ్ఛతి॥

౯. న సందృశే తిష్ఠతి రూపమస్య న చక్షుషా పశ్యతి కశ్చనైనమ్ । హృదా మనీషా మనసాభిక్లృప్తో య ఏత ద్విదు రమృతా స్తే భవన్తి ॥

౧౦. యదా పఞ్చావతిష్ఠన్తే జ్ఞానాని మనసా సహ । బుద్ధిశ్చ న విచేష్టేత తా మాహుః పరమాం గతిమ్ ॥

౧౧. తాం యోగమితి మన్యన్తే స్థిరా మిన్ద్రియ ధారణామ్। అప్రమత్త స్తథా భవతి యోగో హి ప్రభవాప్యయౌ॥

చం॥ పలుకు మనంబు కన్నతని పట్టు కనుంగొనలేవు, చూ
డఁగాఁ। గలఁడని పల్కు తక్క వఱి కన్గొను సాధన
మెద్ది(౧౨), కావునన్। గలుగుట తత్త్వభావ మనఁగా
నివి రెండును గల్గ నాపయిన్। గలఁడనఁ దత్త్వభావము
ప్రకాశము గాంచి ప్రసన్నమై తగున్ (౧౩)॥ ౧౧

ఉ॥ హృదయములోపలన్ గలుగు నెల్ల మనోరథముల్
శమింప సం। మదమున మర్త్యుఁడప్పుడె యమర్త్యత
బ్రహ్మసుఖాన్వితుండగున్ (౧౪), । హృదయమునందు
నున్న ముడులెల్లను వీఁగిన యప్పుడే సుమీ। యిది య
మృతత్వ హేతువగు, నింతియ నీకనుశాసనం బగున్
(౧౫)॥ ౧౨

కం॥ శతము నొకండును హృదయా। న్వితములు నాడు
లు గలవొకఁ డింటు శిరస్సుం। గతమగు నామృతి వెడ
లిన। మృతతం గను, నుత్క్రమణమె యితరగతి

---

౧౨. నైవ వాచా న మనసా ప్రాప్తుం శక్యో న చక్షు
షా। అస్తీతి బ్రువతో ఽన్యత్ర కథం తదుపలభ్యతే॥

౧౩. అస్తీత్యేవోపలబ్ధవ్య స్తత్త్వభావేన చోభయోః। అ
స్తీత్యేవోపలబ్ధస్య తత్త్వభావః ప్రసీదతి॥

౧౪. యదా సర్వే ప్రముచ్యన్తే కామా యే ఽస్య హృది
శ్రితాః। అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ స
మశ్నుతే॥

౧౫. యదా సర్వే ప్రభిద్యన్తే హృదయస్యేహ గ్రన్థయః।
అథ మర్త్యోఽమృతో భవ త్యేతావ దనుశాసనమ్॥

౧౬. శతం చైకా చ హృదయస్య నాడ్య స్తాసాం మూ
ర్ధాన మభినిస్సృతైకా। తయోర్ధ్వమాయ న్నమృత

యిడున్ (౧౬)॥ ౧౩

చం॥ జన హృదయంబులం దొకఁడు సన్నిహితుం డయి
యంత రాత్ముడై । యనయము నుండు సంగుటము నం
తియ పూరుషుఁ, డాతనిన్ హరంc । బున నెగయిం
పఁగా వలయు ముంజతృణమునుండి యిషీకనొలె నీ ।
తను ప్రననుండి ధీరత, సతం డమృతంబును శుక్రమౌఁ
జుమీ (౧౭)॥ ౧౪

తే.గీ॥ యముఁడు చెప్పిన బ్రహ్మవిద్యను సయోగ । విధిగ
నంతయు నచికేతుఁ డధిగమించి । బ్రహ్మసంప్రాప్తుఁడ
య్యె నీరజుఁడునమృతుఁ,। డితరుఁ డధ్యాత్మ నెఱిఁగి
న నిట్టులె యగు(౧౮)॥ ౧౫

ఉ॥ మనలనతండు ప్రోవుత సమంబుగఁ, బాలనసేయుఁ
గాప్రితన్ । మనముసు వీర్యమొక్క మొగి మానక చే
యుముగాత నెప్పుడున్ । మనదగునీయధీతమును మాని
త తేజముగాత, ద్వేషమున్ । మన కెపుడున్ దొలంగు

---

త్మ మేవ విద్వజ్ఞాన్యోఽతర్పిచణే భవన్తి ॥

౧౭- అఙ్గుష్ఠమాత్రః పురుషోఽన్తరాత్మా సదా జనానాం హృదయే సన్నివిష్టః । తం స్వాచ్ఛరీరాత్ప్రవృహే న్ముఞ్జాదివేషీకాం ధైర్యేణ । తం విద్యాచ్ఛుక్ర మమృతం తం విద్యాచ్ఛుక్ర మమృతమితి ॥

౧౮- మృత్యుప్రోక్తాం నచికేతోఽథ లబ్ధ్వా విద్యామేతాం యోగవిధించ కృత్స్నమ్ । బ్రహ్మప్రాప్తో విరజోఽభూ ద్విమృత్యు రన్యోఽప్యేవం యో విదధ్యాత్మమేవ ॥

౧౯. సహ నావవతు । సహ నౌ భునక్తు । సహవీర్యం కరవా వహై । తేజస్వినావధీత మస్తు మా విద్విషావహై । ఓం

త, శమంబు శమంబు శమంబు గావుతన్ (౧౯)॥ ౧౬

ఇది మహామహోపాధ్యాయ శ్రీపరవస్తు
వేంకటరంగనాథాచార్యార్య వరగురు కృతు
లలోనాంధ్రికఠోపనిషత్తు.

శాన్తిశ్శాన్తిశ్శాన్తిః ॥

ఇతిషష్ఠీవల్లీ.

ఇతిద్వితీయోఽధ్యాయః.

కఠోపనిషత్సమాప్తా.



# ఆంధ్రప్రశ్నోపనిషత్తు.

శాంతి.

ఉ॥ వింపుము గాత మా చెవుల వేలుపులార శుభంబు లెప్పుడున్ । గంపుముగాత భద్రములె కన్నుల నోయ జనీయులార యె । ప్డుందరమైన యంగముల పోడిమి మిమ్మునుతించువారమై। యుందుముగాత నాయువిరవొందగ మేనుల మీకు నింపుగాన్ ॥

ఆ॥వె॥ ఇంద్రుడిచ్చు మేలు వృద్ధశ్రవుడు విశ్వవేదుడైన పూష విభుడు నట్లు । తానరిష్టనేమి తార్క్ష్యుండు మాకు బృ । హస్పతియును శుభదులగుదు రెలమి ॥

(శాంతిశ్శాంతిశ్శాంతి).

వ। భారద్వాజుండగు సుకేశుండును, శైబ్యుండగు సత్యకాముండును, సౌర్యాయణియగు గార్గ్యుండు, నాశ్వలాయ

---

# ప్రశ్నోపనిషత్.

శాన్తిః.

భద్రం కర్ణేభి శ్శృణుయామ దేవాః। భద్రం పశ్యే మాక్షభి ర్యజత్రాః । స్థిరై రఙ్గై స్తుష్టువాగ్ంస స్తనూభిః । వ్యశేమ దేవ హితం యదాయుః । స్వస్తిన ఇన్ద్రో వృద్ధశ్రవాః । స్వస్తి నః పూషా విశ్వవేదాః । స్వస్తి న స్తార్క్ష్యో అరిష్ట నేమిః । స్వస్తి నో బృహస్పతి ర్దధాతు ॥

(ఓంశాన్తి శ్శాన్తి శ్శాన్తిః.)

౧. సుకేశా చ భారద్వాజః శైబ్యశ్చ సత్యకామః సౌర్యాయణీ చ గార్గ్యః కౌశల్య శ్చాశ్వలాయనో భార్గవో

నుండగు కౌసల్యుండును, భార్గవుండగు వైదర్భియును, కా
త్యాయనుండగు కబంధియు,నను నీయార్వురును బ్రహ్మపరులు
ను బ్రహ్మనిష్ఠులు నై పరబ్రహ్మంబు వెదకుచు నీతం డిదంతయు
ను మనకుం జెప్పం గలండని సమిత్పాణులై భగవంతునిం బి
ప్పలాదుం జేరంజనిరి(౧). వారల కాఋషి వెండియుం దపో
బ్రహ్మచర్య శ్రద్ధల నొకసంవత్సరం బిచ్చట నుండి యటపై
యభీష్టంబుగాఁ బ్రశ్నంబు లడుగుడు, మేమెఱుంగఁ గలమే
నియంతయు మీకుఁ దెలిపెద మనియె(౨). అటపైఁ గాత్యా
యనుండగు కబంధి వచ్చి భగవంతుఁడా యీప్రజ లెందునుండి
పుట్టుచున్నారని యడిగె(౩). ఆతని కతం డిట్లనియె-

ప్రజాపతి ప్రజాకాముండై తపమొనరించె. తపంబుఁ
జేసి పేరలు నాకుఁ బ్రజలం బెక్కువిధంబులం జేయుదునని

---

వైదర్భిః కబన్ధీ కాత్యాయన స్తేహైతే బ్రహ్మపరాః
బ్రహ్మనిష్ఠాః పరం బ్రహ్మాన్వేషమాణా ఏషహవై తత్స
ర్వం వక్ష్యతీతి తేహ సమిత్పాణయో భగవన్తంపిప్ప
లాద ముపసన్నాః ॥

౨. తాన్ హ స ఋషి రువాచ భూయ ఏవ తపసా బ్ర
హ్మచర్యేణ శ్రద్ధయా సంవత్సరం సంవత్స్యథయథా
కామం ప్రశ్నాన్ పృచ్ఛథ యది విజ్ఞాస్యామః స
ర్వం హ వో వక్ష్యామ ఇతి ॥

౩. అథకబన్ధీకాత్యాయన ఉపేత్య పప్రచ్ఛ భగవన్ కు
తో హ వా ఇమాః ప్రజాః ప్రజాయన్త ఇతి ॥

౪. తస్మై స హోవాచ ప్రజాకామో వై ప్రజాపతిః సత
పోఽతప్యత సతపస్తప్త్వా స మిథునముత్పాదయతే ।
రయించ ప్రాణం చేత్యేతౌ మే బహుధా ప్రజాః

మెంచి రయియుం బ్రాణంబు ననుమిథునముం బుట్టించె(౪). ప్రాణంబె యాదిత్యుండు- రయియె చంద్రుండు- మూర్తంబు నమూర్తంబునను నిది యెల్ల రయి- కావున మూర్తియే రయి యయ్యె- (౫) మఱి యాదిత్యుం డుదయింపుచుం దూర్పు దిక్కుం జొచ్చుం గావునం దూర్పుప్రాణంబులం గిరణంబులం జేర్చు- అట్లు దక్షిణంపుదిక్కును బడమటిదిక్కును వడదిక్కును గ్రిందును మీదు నవాంతరదిక్కులుం జొచ్చుచు నంతయుం బ్రకాశింపించుం గాన నన్నిప్రాణంబులం గిరణంబులం జేర్చు (౬)- అయితండె వైశ్వానరుండు విశ్వరూపుండు ప్రాణమునగ్నియునై యుదయింపుచున్నవాఁడు- ఇది పద్యమునం జెప్పంబడియె-(౭).

తే॥గీ॥ విశ్వరూపుఁడు హరి జాతవేదుఁడు తపనుండు జ్యోతియును బరాయణముం డొకండు । వేవెలుంగు శతవిధము

---

కల్పిష్యత ఇతి ॥

౫. ఆదిత్యో హవై ప్రాణో రయి రేవ చన్ద్రమాః రయిర్వా ఏతత్సర్వం యన్మూర్తం చామూర్తంచ తస్మా న్మూర్తి రేవరయిః ॥

౬. అథా దిత్యః ఉదయ న్యత్ప్రాచీందిశం ప్రవిశతి తేన ప్రాచ్యాన్ ప్రాణాన్ రశ్మిషు సన్నిధత్తే । యద్దక్షిణాం యత్ప్రతీచీం యదుదీచీం యదధో యదూర్ధ్వం యదన్తరా దిశో యత్సర్వం ప్రకాశయతి తేన సర్వాన్ ప్రాణాన్ రశ్మిషు సన్నిధత్తే ॥

౭. స ఏష వైశ్వానరో విశ్వరూపః ప్రాణోఽగ్ని రుదయతే తదేతదృచాభ్యుక్తమ్ ॥

౮. విశ్వరూపం హరిణం జాతవేదసం పరాయణం జ్యోతిరేకం తపన్తమ్। సహస్ర రశ్మి శ్శతధా వర్తమానః

గా వసించు । ప్రాణుఁ డుదయించు సూర్యుఁడు ప్రజలకెల్ల॥ (౮)

వ॥ సంవత్సరంబే కదా ప్రజాపతి- వానికి దక్షిణాయనంబు నుత్తరాయణంబు ననురెండు మార్గంబులుగలవు- కావున నెవ్వారలిష్టాపూర్తంబులను కృతకంబుల నుపాసింపుదురో వారలు చంద్రలోకంబుం జెందుదురు- వారలె మరలి వత్తురు- కావున నీఋషులు ప్రజాకాములగుచు దక్షిణాయనంబు పొందుదురు. పితృయాణ సంబంధి యగు నీచంద్రుండే కదా రయి(౯).

మఱి తపో బ్రహ్మచర్య శ్రద్ధా విద్యల నాత్మస్వరూపంబు వెదకి యుత్తరాయణమార్గంబున నాదిత్యునిం జెందుదురు- ఇదియె కదా ప్రాణాయతనంబు- ఇదియె యమృతంబభయం బిదిపరాయణం బిందుండి మరల రీప్రజాపతియెః రోధకుండు - కావున నీపద్యంబు. (౧౦)

---

ప్రాణః ప్రజానా ముదయ త్యేష సూర్యః ॥

౯. సంవత్సరో వై ప్రజాపతి స్తస్యాయనే దక్షిణం చోత్తరంచ తద్యేహ వై తదిష్టాపూర్తే కృతమి త్యుపాసతే తే చాన్ద్రమసమేవ లోక మభిజయన్తే తఏవ పునరావర్తన్తే తస్మాదేతే ఋషయః ప్రజాకామా దక్షిణం ప్రతిపద్యన్తే। ఏషహ వై రయిర్యః పితృయాణః।

౧౦. అథో త్తరేణ తపసా బ్రహ్మచర్యేణ శ్రద్ధయా విద్యయాత్మానమన్విష్యాదిత్య మభిజయన్తే ఏతద్వై ప్రాణానామాయతన మేతదమృత మభయ మేతత్పరాయణమేతస్మా న్న పునరావర్తన్త ఇత్యేష నిరోధః ॥ తదేషశ్లోకః ।

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



తే॥గీ॥ ద్వాదశాకృతి పిత పంచపాదుఁ డితఁడు। జివిఁ బరా
ర్ధస్థుఁడు పురీషి యవు నటఁడు౹ । పరులు, సప్తచ
క్రిమున షడరమునందు । నర్పితుండు విచక్షణుం డం
డు రొరులు ॥ (౧౧)

వ॥ మాసముకదా ప్రిజాపతి- అతనికిం గృష్ణపక్షుంబె
రయి- శుక్లపక్షుంబె ప్రాణంబు- కావున నీఋషులు శుక్లప
క్షుంబున నితరు లితరపక్షుంబున నిష్టిం జేయుచుందురు(౧౨)

అహోరాత్రంబె ప్రిజాపతి- వానికిఁ బగలేప్రా
ణంబు- రాత్రియే రయి- పగలు రతిజేయువారు ప్రాణ
ముం గదా వుత్తురు- కావున రాత్రి రతిం గూడుట బ్రహ్మ
చర్యంబె యగును (౧౩)-

అన్నంబె కదా ప్రిజాపతి- అందువలనఁ గదా రేతం
బు- దానివలన నీప్రిజలు పుట్టుచుందురు (౧౪)-

---

౧౧. పఞ్చ పాదం పితరం ద్వాదశాకృతిం దివ ఆహుః ప
రే అర్ధే పురీషిణమ్।అథేమే అన్య ఉ పరే విచక్షణం
సప్త చక్రే షడర ఆహు రర్పితమితి ॥

౧౨. మాసోవై ప్రిజాపతి స్తస్య కృష్ణ పక్ష ఏవరయిః శు
క్లః ప్రాణస్త స్మాదేత ఋషయశ్శుక్ల ఇష్టిం కుర్వన్తీ
తర ఇతరస్మిన్ ॥

౧౩. అహోరాత్రోవై ప్రిజాపత స్తస్యాహరేవ ప్రా
ణో రాత్రిరేవ రయిః ప్రాణంవా ఏతే ప్రిస్కన్దన్తి ।
యే దివా రత్యా సంయుజ్యన్తె బ్రహ్మచర్యమేవ తద్య
ద్రాత్రౌ రత్యా సంయుజ్యన్తే ॥

౧౪. అన్నం వై ప్రిజాపతి స్తతోహవై తద్రేత స్తస్మాది
మాః ప్రజాః ప్రిజాయన్త ఇతి ॥

కావునఁ బ్రజాపతి వ్రతంబు నెవ్వరు చేయుదురో వారు మిథునంబు పుట్టించువారు- ఎవ్వారలకుఁ దపంబు బ్రహ్మచర్యంబుం గలదో యెవ్వరియందు సత్యము ప్రతిష్ఠితమై నదో వారికే యీబ్రహ్మలోకంబు (౧౫)-

కుటిలం బనృతంబు మాయయు నెవ్వారలయందుఁ గలుగవో వారలకే విరజంబగు నాబ్రహ్మలోకము (౧౬)-

---

వ ॥ అటపై నతని భార్గవుండగు వైదర్భి యడిగె నెట్లనిన- ఓభగవంతుఁడా! ఎందరే దేవులు ప్రజను ధరింపుచున్నారు, ఎందరు దీనిం బ్రకాశింపఁపుచున్నారు, ఇందెవ్వఁడు వరిష్ఠుండు (౧)- అన నతని కాతం డిట్లనియె-

ఆకాశంబును వాయువు నగ్నియును జలంబును బృథివియు ననువారును వాక్కును మనంబును నేత్రంబును శ్రో

---

౧౫. తద్యే హ తత్ప్రజాపతి వ్రతంచరన్తి తే మిథున ముత్పాదయన్తే । తేషామే వైష బ్రహ్మలోకో యేషాం తపో బ్రహ్మచర్యం యేషు సత్యం ప్రతిష్ఠితమ్ ।

౧౬. తేషామసౌ విరజో బ్రహ్మలోకో నయేషు జిహ్మ మనృతం నమాయా చేతి ॥

ఇతి ప్రథమః ప్రశ్నః.

౧. అథ హైనం భార్గవో వైదర్భిః పప్రచ్ఛ । భగవన్ కత్యేవ దేవాః ప్రజాం విధారయన్తే కతర ఏతత్ప్రకాశయన్తే కః పున రేషాం వరిష్ఠ ఇతి ॥

౨. తస్మై స హోవాచాకాశో హ వా ఏష దేవో వాయు రగ్నిరాపః పృథివీ వాఙ్మనశ్చక్షు శ్శ్రోత్రంచ। తే ప్ర

త్రంబు ననువారును దేవులు- మేమీ బాణమునుబట్టి ధరింపుచు న్నవారమని వారు వివరింపం దొడంగిరి (2)- వారికి వరిష్ఠుం డగు ప్రాణుండు మోహమును జెందకుండేనొకండనె నాస్వ రూపంబు నయిదు తెఱంగులం బంచి యీ బాణముం బట్టి ధరిం పుచున్నవాఁడ ననియె- వారది నమ్మరైరి (3)-ఆతండభిమానంబు నం బైకి లేవం జూచె, ఆతండు లేచిన వెంబడి నందరును లే వం దొడంగి రతండు ప్రతిష్ఠితుఁడుగా నందరును బ్రతిష్ఠితులై రి,అదియెట్లన్నను- తేనెటీఁగలన్నియుఁ దేనెటీఁగల పెద్ద లేవం జూచిన లేవం దొడఁగును నది నిల్చిన నిల్చు- అట్ల వాఙ్మనశ్చ క్షుశ్శ్రోత్రదేవులు సంతసిల్లి ప్రాణదేవునిఁ బొగడం దొ డంగిరి (4).

---

కాశ్యాభివదన్తి వయ మేతద్బాణ మవష్టభ్య విధా రయామః ॥

3. తాన్ వరిష్ఠః ప్రాణ ఉవాచ। మా మోహ మాపద్య థాహ మేవైతత్ పఞ్చధాత్మానం ప్రవిభజ్యైతద్బా ణమవష్టభ్య విధారయామీతి ॥

4. తేఽశ్రద్ధధానా బభూవుః సోఽభిమానాదూర్ధ్వము త్క్రామత ఇవ తస్మిన్నుత్క్రామ త్యథేతరే సర్వ ఏవోత్క్రామన్తే తస్మింశ్చ ప్రతిష్ఠమానే సర్వ ఏవ ప్రతిష్ఠన్తే। తద్యథా మక్షికా మధుకర రాజాన ముత్క్రా మన్తం సర్వాఏవోత్క్రామన్తే తస్మింశ్చ ప్రతిష్ఠమా నే సర్వా ఏవ ప్రాతిష్ఠన్త ఏవం వాఙ్మనశ్చక్షుః శ్రో త్రం చ తే ప్రీతాః ప్రాణం స్తున్వన్తి ॥

తే॥గీ॥ ఈతఁడె తపించు నగ్నియై యితఁడెసూర్యుఁ । డితఁడె పర్జన్యుఁ డింద్రుఁడు నితఁడె వాయు । వీతఁడే సుమ్ము పృథివి రయి యును సదస । దాత్మకుండగు దేవుండు నమృత మితఁడె (౫)॥

ఆ॥వె॥ ఋక్కు యజువు సామ మిట్లుజన్నంబు బ్రహ్మము ను క్షత్రము నను నన్నియు నిప్ర।యరము లెట్టులుండు నరదంబునాభియం।దట్ల ప్రాణమందు నమరియుండు॥

ఆ॥వె॥ ప్రజలకెల్ల నీవె పతివౌచుఁ బ్రాణ గర్భముల సంచరించి ప్రతిజనింతు,। బలుల నీకు నీప్రజలిడుదు,రిట్టి వి।ధుల మెయిం బ్రతిష్ఠితుఁడవు కాన (౭)॥

ఆ॥వె॥ ఈవె హవ్యముల వహింతువు సురలకు,। పితరులకును ముందు పెట్టు స్వధయు।నీవె,సత్యము గ నయితి వథర్వాంగిర।ఋషులోనర్చు సచ్చరితము తలఁప(గా) ॥

తే॥గీ॥ నీ వెయింద్రుండ వో ప్రాణ దేవ తేజ।మునను రుద్రుండ వైతివి ప్రోచువాఁడ।వీవె కద జ్యోతులకుఁబతివై వెలుఁ

---

౫ ఏషోఽగ్నిస్తపత్యేష సూర్య ఏషపర్జన్యో మఘవా నేష వాయుః । ఏషపృథివీరయిర్దేవః సదసచ్చామృతంచ యత్॥

౬ అరా ఇవ రథనాభౌ ప్రాణేసర్వం ప్రతిష్ఠితమ్। ఋచోయజూంషిసామాని యజ్ఞః క్షత్రం బ్రహ్మచ ॥

౭ ప్రజాపతి శ్చరసి గర్భేత్వమేవ ప్రతిజాయసే । తుభ్యం ప్రాణ ప్రజాస్త్విమాబలిం హరన్తి యఃప్రాణైః ప్రతితిష్ఠసి ॥

౮ దేవానా మసివహ్నితమః పితౄణాం ప్రథమా స్వధా। ఋషీణాం చరితం సత్య మథర్వాఙ్గిరసామపి ॥

౯ ఇన్ద్రస్త్వం ప్రాణ తేజసా రుద్రోఽసి పరిరక్షితా।

గుచ్ఛసూర్యుఁడను పేరఁ దిరుగుదు సురపథమున (౯)॥

క౦॥ కలప్రజలు ప్రాణుఁడా యీయిల వర్షము నీవు కురి
య నెలమి మనకుఁ గావలసిన యన్నం బంతయుఁ
గలుగు ననుచు సంతసంబుఁ గాంతురు మదిలోన్ (౧౦)

ఆ॥గీ॥ ప్రాణ యేకఋషివి వ్రాత్యుండవయిన సత్పతివి నీ
వె సర్వభక్షకుఁడవు। మాతరిశ్వదేవ మాతండ్రి వీవు
స్తిర్పణంబు జేసు మాద్య చెపుదు(౧౧)॥

ఆ॥గీ॥ వాక్కునందు నెద్ది వర్తిలు నీమేన। శ్రోత్రమందు నట్ల
నేత్రమందు। మనమునందు నుండు ననయంబు దాని
నిం। శాంతఁ జేసి వెడల కుండుమయ్య (౧౨)॥

ఆ॥వె॥ ఎద్ది త్రిదివమందు నెంతయుఁ బ్రతిష్ఠిత। మద్ది ప్రాణ వ
శమునందు నుండు। మాత సుతులఁ బ్రోచు మాడ్కిఁ
గాపాడుమీ। సిరిని బ్రజ్ఞ నొందఁ జేయు మమ్ము(౧౩)

---

త్వ మన్తరిక్షే చరసి సూర్యస్త్వం జ్యోతిషాంపతిః॥

౧౦. యదా త్వమభివర్షస్యథేమాః ప్రాణ తే ప్రజాః। ఆ
నన్దరూపా స్తిష్ఠన్తి కామాయాన్నం భవిష్యతీతి ॥

౧౧. వ్రాత్యస్త్వం ప్రాణైకఋషి రత్తా విశ్వస్య సత్పతిః।
వయ మాద్యస్య దాతారః పితా త్వం మాతరిశ్వనః॥

౧౨. యా తే తనూర్వాచి ప్రతిష్ఠితా యా శ్రోత్రేయా చ
క్షుషి। యా చ మనసి సన్తతా శివాం తాం కురు మో
త్క్రమీః॥

౧౩. ప్రాణస్యేదం వశే సర్వం త్రిదివే యత్ప్రతిష్ఠితమ్।
మాతేవ పుత్రాన్ రక్షస్వ శ్రీశ్చ ప్రజ్ఞాం చ థేహి న
ఇతి ॥

ఇతి ద్వితీయః ప్రశ్నః.

అటుపై నీతని నాశ్వలాయనుండగు కౌశల్యుం డిట్లని యడిగె- ఓ భగవంతా! ప్రాణ మెందుండి పుట్టుచున్నది- ఈశరీరమున కెట్లు వచ్చుచున్నది- ఆత్మ నేర్పరచి యెట్లుండును- ఏ చొప్పున నిందుండి వెడలును- వెలి కెట్లు చేరును- అధ్యాత్మమున నెట్లు నిలుచును(౧)- అనిన నాతని కతం డిట్లు పలికె- అతిప్రశ్నలం జేయుచున్నావు- నీవు బ్రహ్మిష్ఠుండవు- కావున నీకు నేఁ జెప్పెద(౨)-

ఆత్మవలననె ప్రాణంబు పుట్టును- ఇది పురుషుని నీడవోలె మనంబు జాడనె యీమేనునకు వచ్చును(౩)-

సమ్రాజుండు "నీవీగ్రామంబు నేలు- నీవీ గ్రామంబు నేలు" మని యధికారుల వినియోగించునట్ల యీప్రాణంబుగ నితరప్రాణంబుల వేఱువేఱ నధికరించు(౪)-

---

౧. అథ హైనం కౌశల్య శ్చాశ్వలాయనః పప్రచ్ఛ। భగవన్ కుత ఏష ప్రాణో జాయతే కథమాయా త్యస్మింఛ్ఛరీరే ఆత్మానం వా ప్రవిభజ్య కథం ప్రాతిష్ఠతే కేనోత్క్రమతే కథం బాహ్యమభిధత్తే కథ మధ్యాత్మమితి ॥

౨. తస్మై స హోవాచాతిప్రశ్నాన్ పృచ్ఛసి బ్రహ్మిష్ఠోఽసీతి తస్మాత్తేఽహం బ్రవీమి ॥

౩. ఆత్మన ఏష ప్రాణో జాయతే। యథైషా పురుషే ఛాయైతస్మిన్నేత దాతతం మనో కృతే నాయా త్యస్మింఛ్ఛరీరే ॥

౪. యథా సమ్రాడే వాధికృతా న్వినియుఙ్క్తే। ఏతా న్గ్రామా నేతాన్ గ్రామా నధితిష్ఠస్వే త్యేవ మేవైష ప్రాణః ఇతరాన్ ప్రాణాన్ పృథక్పృథగేవ సన్నిధత్తే ॥

పాయూపస్థంబుల నపానం బను పేర నుండు ప్రాణంబు ముఖనాసికలవెడలి చక్షుః శ్రోత్రంబులం దానె నిల్చు. నడుమ సమానంబు పేర నుండు. ఇదియె కదా హుతమైన యన్నంబును సమముగా నడవుచున్నది. అందువలన నీయేడు వెలుంగులు వెడలుచున్నవి(౫).

హృదయంబునఁ గదా యీయాత్మ యుండును. ఇందు నూటయొక్క నాడు లుండును. అందు నొక్కొక్క నాడికి నూరేసి నాడులుగలవు. అందు నొక్కొక్కదానికి డెబ్బదిరెండేసి కలవు. ఇట్లు వేనవేలు నాడులు కలవు. వానిలో వ్యానంబు పేరఁ జరించు(౬).

ఇంక నొకనాడి యుదానంబు పేర మీదుముఖంబుగా నుండి పుణ్యమునఁ బుణ్యలోకంబునకును బాపంబునఁ బాపలోకంబునకును నీరెంటనె మనుష్యలోకంబునకును నడపు(౭).

---

౫. పాయూపస్థే ఽపానం చక్షుశ్శ్రోత్రే ముఖ నాసికాభ్యాం ప్రాణస్స్వయం ప్రాతిష్ఠతే మధ్యేతు సమానః । ఏష హ్యేతద్ధుతమన్నం సమం నయతి తస్మాదేతాస్స ప్తార్చిషో భవన్తి ॥

౬. హృది హ్యేష ఆత్మా । అత్రైత దేకశతం నాడీనాం తాసాం శతం శత మేకైకస్యాం ద్వాసప్తతి ర్ద్వాసప్తతిః ప్రతిశాఖా నాడీసహస్రాణి భవన్త్యాసు వ్యానశ్చరతి ॥

౭. అథైకయోర్ధ్వ ఉదానః పుణ్యేన పుణ్యం లోకం నయతి పాపేన పాప ముభాభ్యామేవ మనుష్యలోకమ్ ॥

ఆదిత్యుండు కదా బాహ్యప్రాణంబు. ఈతండె చా క్షుషప్రాణంబు ననుగ్రహింపుచు నుదయించు. పృథివీదేవ తయె పురుషుని యపానంబై పట్టి యుండును. నడుమ నుండు నాకాశంబు సమానంబగు. వాయువే వ్యానంబగు(౮).

తేజంబే యుదానంబు కావునఁ దేజంబు శమింప మ నంబునం జేరు నింద్రియంబులతో వెండియును జన్మంబుఁ గాంచు(౯).

ఏచిత్తంబుననుండు దానితోడనె ప్రాణమ్ముం జేరు ను. ప్రాణంబు తేజంబుతోఁ గూడి యాత్మతోఁ గూడ సంకల్పించినచొప్పున లోకమ్ముం బొందించు(౧౦).

ఇట్లెఱింగి ప్రాణంబు నుపాసించు వానికిఁ బ్రజాహా నికలుగ దమృతుండు నగు. ఇందుకుఁ బద్యంబు గలదు(౧౧).

---

౮. ఆదిత్యోహవై బాహ్యః ప్రాణ ఉదయ త్యేష హ్యే నం చాక్షుషం ప్రాణ మనుగృహ్ణానః । పృథివ్యాం యా దేవతా సైషా పురుషస్యాపాన మవష్టభ్యా న్త రా యదాకాశ స్స సమానో వాయు ర్వ్యానః ॥

౯. తేజో హవై ఉదాన స్తస్మా దుపశాన్త తేజాః । పు నర్భవ మిన్ద్రియై ర్మనసి సమ్పద్యమానైః ॥

౧౦. య చ్చిత్త స్తేనైష ప్రాణ మాయాతి ప్రాణ స్తేజ సాయుక్తః । సహాత్మనా యథా సఙ్కల్పితం లోకం నయతి ॥

౧౧. య ఏవం విద్వాన్ ప్రాణం వేద । న హాస్య ప్రజా హీయతేఽమృతో భవతి తదేష శ్లోకః ॥

తా॥ మును ప్రాణము జనియించుట । యును వచ్చుటయు
ను బ్రతిష్ఠయును విభుభావం । బును దాని పంచగూ
పత । యును డెలిసిన నమృతభావ యోగ్యత కలు
గున్ (౧౨)॥

---

అటపై నీతని సౌర్యాయణియగు గార్గ్యుఁడు భగవం
తా! యీపురుషునియం దెవ్వి నిద్రించు నెవ్వి మేల్కొను
చుండు నీదేవుం డెట్టివాఁడై స్వప్నంబులం జూచు నెవ్వని
కీసుఖంబు కలుగు నెవ్వనియం దన్నియును సుప్రతిష్ఠితంబు
లగుచుండు నని యడిగె(౧)-

ఆతని కతం డిట్లనియె-ఓగార్గ్యా! సూర్యుం డస్తమించు
నప్పుడు కిరణంబులన్నియు నెట్లు తేజోమండలంబున నేకీభ
వించు నవిమాటిమాటికి నుదయించునప్పుడు వెడలుచుండు- అ

---

౧౨. ఉత్పత్తి మాయతిం స్థానం విభుత్వం చైవ పఞ్చధా ।
అధ్యాత్మం చైవ ప్రాణస్య విజ్ఞాయామృత మశ్ను
తే విజ్ఞాయామృత మశ్నుత ఇతి ॥

ఇతి తృతీయః ప్రశ్నః.

౧. అథ హైనం సౌర్యాయణీ గార్గ్యః పప్రచ్ఛ । భగవ
న్నేతస్మిన్ పురుషే కాని స్వపన్తి కాన్యస్మిన్ జాగ్రతి
కతర ఏష దేవ స్స్వప్నాన్ పశ్యతి కస్యైతత్సుఖం
భవతి కస్మిన్ను సర్వే సంప్రతిష్ఠితా భవన్తీతి ॥

౨. తస్మై స హోవాచ యథా గార్గ్య మరీచయోఽర్క
స్యాస్తం గచ్ఛతః సర్వా ఏతస్మిం స్తేజో మణ్డల ఏకీ
భవన్తి । తాః పునః పున రుదయతః ప్రచర న్త్యేవం

సైకదా యీయంతయును బరదేవుం డనంబడు మనంబున నే
కీభవించు. కావున నప్పుడీ పురుషుండు వినండు చూడండు
మూర్కొనండు చవిచూడండు ముట్టండు పలుకండు కొనండా
నందింపండు నడవండు నిద్రించుచున్నాం డనియందురు (౨).

ఈ ప్రకారంబునఁ బ్రాణాగ్నులె మేల్కొంచి యుండు. అ
పానంబె కదా గార్హపత్యంబు. వ్యానంబె యన్వాహార్య
పచనంబు. గార్హపత్యంబునుండి ప్రణీతంబగుం గానఁ బ్రా
ణం బాహవనీయం బగు (౩). ఉచ్ఛ్వాస నిశ్శ్వాసంబులే
యాహుతులు. వానిఁ సమంబుగా నడపునది సమానంబు. మ
నంబే కదా యజమానుండు. ఉదానం బిష్టఫలంబె. అది యీ
యజమానునిం బ్రతిదినంబును బ్రహ్మముం బొందించు (౪).

---

హ వై తత్సర్వం పరేదేవే మనస్యేకీభవతి । తేన త
ర్హ్యేష పురుషో న శృణోతి న పశ్యతి న జిఘ్రతి న ర
సయతే న స్పృశతే నాభివదతే నాదత్తే నానన్ద
యతే న విసృజతే నేయాయతే స్వపితీత్యాచక్షతే ॥

3\. ప్రాణాగ్నయ ఏవైతస్మిన్ పురే జాగ్రతి । గార్హప
త్యో హ వా ఏషోఽపానో వ్యానోఽన్వాహార్య పచ
నో యద్గార్హపత్యాత్ప్రణీయతే ప్రణయనా దాహ
వనీయః ప్రాణః ॥

౪. యదుచ్ఛ్వాస నిశ్శ్వాసా వేతా వాహుతీ సమం నయ
తీతి స సమానః । మనో హ వావ యజమాన ఇష్టఫలమే
వోదానః స ఏనం యజమాన మహరహ ర్బ్రహ్మ గ
మయతి ॥

ఇందీదేవుండు స్వప్నమున మహిమ ననుభవించు-చూచిచూచియున్న దానినే చూచును - విని విని యున్నదానినె వినును - దేశ దిగన్తరంబులచే ననుభవించిన దానినె మాటిమాటికి ననుభవించును- చూచినది చూడనిది విన్నది విననిది యనుభవించినది యనుభవింపనిదియు నన్నియుం జూచు నన్నివిధంబులవాండై చూచు(౫)-

తాను తేజంబున నభిభవింపంబడు నప్పు డీదేవుం డిందు స్వప్నంబులం జూడండు-అప్పుడాయీశరీరంబున నీసుఖంబు కలుగును(౬.-అదెట్లన్నను-సౌమ్యుండా పక్షులు నెలవుమ్రానుం జేరునట్ల పృథివియుం బృథివీమాత్రియు జలంబును జలమాత్రియుం దేజంబును తేజోమాత్రియును వాయువును వాయుమాత్రియు నాకాశంబు నాకాశమాత్రియును జూడ్కియుంజూడందగినదియు వీనును వినందగినదియును ముక్కును మూర్కొనంబడునదియును రసంబు నాస్వాదింపందగినదియును ద్వక్కును ముట్టందగినదియును బలుకును బలుకంద

---

౫. అత్రైష దేవస్స్వప్నే మహిమాన మనుభవతి । యద్దృష్టం దృష్ట మను పశ్యతి శ్రుతం శ్రుత మేవార్థమనుశృణోతి దేశదిగన్తరైశ్చ ప్రత్యనుభూతం పునః పునః ప్రత్యనుభవతి దృష్టం చాదృష్టంచ శ్రుతం చాశ్రుతంచానుభూతంచాననుభూతంచ సర్వం పశ్యతి సర్వః పశ్యతి ॥

౬. స యదా తేజసాభిభూతో భవతి । అత్రైష దేవస్స్వప్నా న్నపశ్య త్యథ తదే తస్మిం ఛ్ఛరీరే ఏతత్సుఖం భవతి ॥

౭. స యథా సోమ్య వయాంసి వాసోవృక్షం సంప్ర

గినదియును జేతులం గయికొనందగినదియు నుపస్థంబు నా
నందింపందగినదియును గుదంబును విడువందగినదియును బా
దంబులును నడవందగినదియును మనంబును నెఱుంగందగినది
యును దెలివియుం దెలిసికొనందగినదియు నహంకారంబు న
హంకరింపం దగినదియును జిత్తంబును దలంపం దగినదియును
వెలుంగును వెలిగింపంబడునదియును బ్రాణంబును ధరింపం
బడునదియు నను నివంతయుఁ బరమాత్మయందు నెలకొ
నును (౭-౮)-

ఇతఁడే కదా చూచువాఁడును దాఁకువాఁడును విను
వాఁడును మూర్కొనువాఁడును జవిగొనువాఁడు నెఱుంగు

---

ఠన్తే । ఏవం హవై తత్సర్వం పర ఆత్మని సంప్ర
తిష్ఠతే ॥

౮. పృథివీచ పృథివీమాత్రా చాప శ్చాపోమాత్రా చ తే
జశ్చ తేజోమాత్రాచ వాయుశ్చ వాయుమాత్రా
చాకాశ శ్చాకాశమాత్రాచ చక్షుశ్చ ద్రష్టవ్యం చ
శ్రోత్రం చ శ్రోతవ్యంచ ఘ్రాణంచ ఘ్రాతవ్యంచ రస
శ్చ రసయితవ్యం చ త్వక్చ స్పర్శయితవ్యంచ వాక్చ
వక్తవ్యంచ హస్తౌ చాదాతవ్యం చోపస్థశ్చానన్దయిత
వ్యంచ పాయుశ్చ విసర్జయితవ్యంచ పాదౌచ గన్తవ్యం
చ మనశ్చ మన్తవ్యంచ బుద్ధిశ్చ బోద్ధవ్యం చాహ
ఙ్కార శ్చాహఙ్కర్తవ్యంచ చిత్తంచ చేతయితవ్యం
చ తేజశ్చ విద్యోతయితవ్యంచ ప్రాణశ్చ విధారయి
తవ్యంచ ॥

౯. ఏష హి ద్రష్టా స్ప్రష్టా శ్రోతా ఘ్రాతా రసయితా మ
న్తా బోద్ధా కర్తా విజ్ఞానాత్మా పురుషః । సపరే ఽక్షరే

వాఁడును దెలియువాఁడును జేయువాఁడును దెలివియు న
యిన పురుషుండు- ఆతం డక్షరుండగు పరమాత్మయందు నె
లకొనును(౯)-

ఎవ్వండచ్ఛాయంబు నశరీరంబు నలోహితంబును శు
భ్రంబు నక్షరంబును దెలిసికొను నతం డోసోమ్యా యన్ని
యుం దెలిసి యన్నియునగు- కావున నిప్పద్యం బగు(౧౦)-

తే॥గీ॥ సర్వదేవాన్వితుఁ డయి విజ్ఞాన రూపుఁ । డెందుఁ
బ్రాణములు భూతములు చెందు నెలవు । నెఱుఁగు
వాఁ డట్టి యక్షరం బెవఁడు సోమ్య। వాఁడు సర్వ
జ్ఞుఁడగుచు సర్వంబుఁ జొచ్చు (౧౧)॥

---

అటపై నాతని శైబ్యుండగు సత్యకాముండో భగవం
తా ! మనుష్యులలో నెవ్వఁడు తనప్రాయణం బుండువరకు
నోంకారమును ధ్యానించునో వాఁడు దానిచే నేలోకంబుం

---

ఆత్మని సంప్రతిష్ఠతే ॥

౧౦. సయోహవై తదచ్ఛాయ మశరీర మలోహితం శుభ్ర
మక్షరం వేదయతే యస్తుసోమ్య।ససర్వజ్ఞ స్సర్వో భ
వతి తదేషశ్లోకః ॥

౧౧. విజ్ఞానాత్మాసహదేవైశ్చ సర్వైః ప్రాణాభూతానిసం
ప్రతిష్ఠన్తి యత్ర। తదక్షరం వేదయతే యస్తు సో
మ్య స సర్వజ్ఞస్సర్వ మేవావివేశేతి ॥

ఇతిచతుర్థః ప్రశ్నః.

౧. అథ హైనం శైబ్యస్సత్యకామః పప్రచ్ఛ । సయోహ
వై తద్భగవ న్మనుష్యేషు ప్రాయణాన్త మోఙ్కా
ర మభిధ్యాయీత । కతమం వావ స తేన లోకం

గెలుచు ననియడిగె(౧)- ఆతని కాతం డిట్లనియె - ఓసత్య కామా! ఈయోంకార మనునదియె పరంబు నపరంబు నగు బ్రిహ్మంబు- కావున విద్వాంసుం డీయవలంబనంబుననె యొకటి వానిం గాంచు(౨)-

వాఁడేకమాత్రింబుగా నుపాసించెనేని దానిచేతనె తెలుపంబడి వేగంబుననె జగతి నభిసంపన్నుండగు-ఋక్కులు వాని మనుష్యలోకముం బొందించు-వాఁడచ్చటఁ దపో బ్రిహ్మచర్య శ్రిద్ధలచే సంపన్నుండై మహిమంబు ననుభవించు(౩)-

మఱి యతండు ద్విమాత్రింబుగా మనంబున నుపాసించునేని యజుర్మంత్రింబులచే నంతరిక్షంబున కెగయింపంబడును-వాఁడు సోమలోకంబునకుం బోయి సోమలోకంబున విభూతి ననుభవించి వెండియు మరలి వచ్చు(౪)-

---

జయతీతి ॥

౨. తస్మై సహోవాచ । ఏతద్వై సత్యకామ పరంచాపరంచ బ్రిహ్మ యదోఙ్కార స్తస్మా ద్విద్వానేతేనైవాయతనే నైకతరమన్వేతి॥

౩. స యద్యేకమాత్ర మభిధ్యాయీత స తేనైవ సంవేదితస్తూర్ణమేవ జగత్యా మభిసమ్పద్యతే తమృచో మనుష్యలోక ముపనయన్తె స తత్ర తపసా బ్రిహ్మచర్యేణ శ్రిద్ధయా సమ్పన్నో మహిమాన మనుభవతి ॥

౪. అథయది ద్విమాత్రేణ మనసి సమ్పద్యతే సోఽన్తరిక్షం యజుర్భి రున్నీయతే। ససోమలోకం ససోమలోకె విభూతి మనుభూయ పున రావర్తతే ॥

ఎవ్వండేనిం ద్రిమాత్రింబగు నోమను నీయక్షరంబున నే పరమపురుషు నుపాసించు వాఁడుసూర్య తేజంబున సంపన్నుండై కుబుసంబు విడిచిన యురగంబు మాడ్కిఁ బాపంబెడలి సామంబులచే బ్రహ్మలోకంబు చెందింపంబడు. వాఁడీ పరుండగు జీవఘనునికంటెం బరుండును పురిశయుండు నగు పురుషునిం గాంచు అందు కీరెండు పద్యంబులు కలవు (౫)-

తే।గీ॥ ద్రితముగా నొండె మిక్కిలి దూరమొండెఁ । బలు
కుచో మృత్యువిచ్చు మాత్రిలివి మూఁడు। వెలి నడుమ
లోపలివగు చెయ్వులను లెస్స । గాఁబ్రయోగించు
ప్రాజ్ఞుఁడు కదలఁ డెపుడు (౬)॥

తే।గీ॥ ఋగ్యజుస్సుల భువి నంతరిక్ష మెఱిఁగి। సామములఁ
గవివేద్య మీధామ మద్ది। జ్ఞాని యోంకారమను సా
ధనమున శాంత।మజర మభయము పరము నా నమృత

---

౫. యః పున రేతం త్రిమాత్రేణైవోమి త్యేతేనై వాక్షరేణపరం పురుష మభిధ్యాయీత స తేజసి సూర్యే సమ్పన్నః। యథా పాదోదర స్త్వచా వినిర్ముచ్యత ఏవం హ వై స పాప్మనా వినిర్ముక్తః స సామభి రున్నీయతే బ్రహ్మలోకం సఏతస్మాజ్జీవఘనా త్పరాత్పరం పురిశయం పురుష మీక్షతే తదేతౌ శ్లోకౌ భవతః॥

౬. తిస్రో మాత్రా మృత్యుమత్యః ప్రయుక్తా అన్యోన్యసక్తా అనవిప్రయుక్తాః। క్రియాసు బాహ్యాభ్యన్తరమధ్యమాసు సమ్యక్ప్రయుక్తాసు నకమ్పతే జ్ఞః॥

౭. ఋగ్భి రేతం యజుర్భి రన్తరిక్షం స సామభి ర్యత్తత్కవయో వేదయన్తే। తమోఙ్కారే ణైవాయతనే నాన్వేతి విద్వాన్యత్తచ్ఛాన్త మజర మమృత మభ

మొందు(౭)॥

---

అటపైని భారద్వాజుండగు సుకేశుండు భగవంతా! కౌసల్యుండగు హిరణ్యనాభుండను రాజపుత్రుండు నాయొద్దకు వచ్చి యోభారద్వాజా! షోడశకలుండగు పురుషునెఱుంగుదువా యని ప్రశ్నం బడిగె. ఆకుమారునితో “నేనిది యెఱుంగ- నేనిది యెఱింగితి నేని నీకేలఁ జెప్పను- అనృతమాడినవాఁడు సమూలముగాఁ జెడుం గదా- కావున ననృతమాడం జాల” నని నేనంటి. ఆతండు నూరక రథంబెక్కిపోయె. ఆపురుషుం డెక్కడ నని నిన్నడుగుచున్నానని యడిగె(౧).

ఆతని కాతండిట్లనియె. సోమ్యా! ఎవ్వనియందు షోడశకలలుండు నప్పురుషుం డిందె మేనిలో నున్నవాఁడు(౨).

---

యం పరం చేతి ॥

ఇతి పఞ్చమః ప్రశ్నః.

౧. అథ హైనం సుకేశా భారద్వాజః పప్రచ్ఛ భగవన్ హిరణ్యనాభః కౌసల్యో రాజపుత్రో మాముపేత్యైతం ప్రశ్న మపృచ్ఛత । షోడశకలం భారద్వాజ పురుషం వేత్థ తమహం కుమార మబ్రువం నాహమిమం వేద యద్యహ మిమ మవేదిషం కథం తే నావక్ష్యామితి సమూలో వా ఏష పరిశుష్యతి యోఽనృతమభివదతి తస్మా న్నార్హామ్యనృతం వక్తుం స తూష్ణీం రథమారుహ్య ప్రవవ్రాజ । తం త్వా పృచ్ఛామి క్వాసౌ పురుష ఇతి ॥

౨. తస్మై స హోవాచ। ఇహైవాన్తశ్శరీరే సోమ్య స పురుషో యస్మిన్నేతాః షోడశకలాః ప్రభవన్తీతి ॥

ఎవ్వాఁడు వెడలిన నే వెడలెద నెవ్వాడు నిలిచిన నేనిలు తు నని యాతండు విచారించి ప్రాణంబు సృజియించి ప్రాణం బున శ్రద్ధ నాకాశ జ్యోతి ర్జలపృథివీంద్రియ మనోన్నంబుల నన్నంబున వీర్యంబును దపము మంత్రంబులు కర్మంబు లోకం బులును లోకంబులందు నామంబును సృజించె(౩-౪).

ప్రాబుచున్న యేఱులు సముద్రాయణంబులై సముద్ర మును జెంది యస్తమించు-వాని నామరూపంబులుం జెడు- స ముద్రమనియె పలుకంబడు- అట్ల యీపురుషుని షోడశకలలు పురుషాయణంబులై పురుషునియం దస్తమించు- వాని నామ రూపంబులుం జెడు- పురుషుండనియె పలుకంబడు- ఆయీ పురుషుం డకలుం డమృతుండు- కావున నీపద్యంబు(౫)-

కం॥ అరదంబు నుండి బొడ్డున। నరము లమరు నట్టు లెం దు నమరుం గళలా। పురుషుండు వేద్యుఁ డాతని। తెర

---

౩. స ఈక్షాంచక్రే। కస్మిన్నహ ముత్క్రాన్త ఉత్క్రాన్తో భ విష్యామి కస్మిన్వా ప్రతిష్ఠితె ప్రతిష్ఠాస్యామీతి ॥

౪. స ప్రాణ మసృజత ప్రాణాచ్ఛ్రద్ధాం ఖం వాయుర్జ్యో తి రాపః పృథివీన్ద్రియమ్। మనో ఽన్న మన్నా ద్వీర్యం తపో మన్త్రాః కర్మ లోకా లోకేషుచ నామచ ॥

౫. స యథేమా నద్యస్స్యన్దమానాః సముద్రాయణా స్స ముద్రం ప్రాప్యాస్తం గచ్ఛన్తి భిద్యేతే తాసాం నా మరూపే సముద్ర ఇత్యేవం ప్రోచ్యతె ఏవమేవాస్యప రిద్రష్టు రిమాః షోడశకలాః పురుషాయణాః పురుషం ప్రాప్యాస్తం గచ్ఛన్తి భిద్యేతె తాసాం నామరూపే పురుష ఇత్యేవం ప్రోచ్యతె స ఏషోఽకలో ఽమృతో భవతి తదేషశ్లోకః ॥

౬. అరా ఇవ రథనాభౌ కలా యస్మిన్ ప్రతిష్ఠితాః। తం

వెఱఁగిన మృత్యువును వ్యథింపదు మిమ్మున్ (౬) ౹

వ॥ ఇట్టియె నేను పరబ్రహ్మంబు నెఱుంగుదు నింతకుపై లేదని వారల కాతండు చెప్పె(౭)-
నీవు మమ్ము నవిద్యయావలిగట్టుం జేర్చితివి-కావున నీవె మాతండ్రివని వారలాతని నర్చింపుచుండిరి-

కం॥ పరమబ్రహ్మమువిద్యన్ । బరంపరన్ దెలిపి మమ్ముఁ బా
లించిన యా। పరమఋషులకు నమస్కృతి । పరమఋ
షులకే యొనర్తుఁ బరిపరి నతులన్ (౮) ॥

ఇది మహామహోపాధ్యాయ శ్రీపరవస్తు
వేంకటరంగనాథాచార్యార్య వరగురు కృతు
లలోనాంధ్రప్రశ్నోపనిషత్తు-



---

వేద్యం పురుషం వేద మా నో మృత్యుః పరివ్యథా ఇతి॥

౭- తాన్ హోవాచైతావదేవాహ మేతత్పరం బ్రహ్మ వేద నాతః పరమస్తీతి ॥

౮- తే తమర్చయన్తస్త్వం హి నః పితా యోఽస్మాకమ విద్యాయాః పరం పారం తారయసీతి నమః పరమ ఋషిభ్యో నమః పరమఋషిభ్యః ॥

ఇతి షష్ఠః ప్రశ్నః.

ప్రశ్నోపనిషత్సమాప్తా;



# ఆంధ్ర ముండకోపనిషత్తు.

## శాంతి.

ఉ॥ వింటుము గాత మా చెవుల వేలుపులార శుభంబు లే
ప్పుడున్,। గందుముగాత భద్రములె కన్నుల నో యజనీయులార, యే। పుందిరమైన యంగములపోడిమి
మిమ్మునుతించువారమై। యుందుముగాత నాయువిర
వొందగ మేనుల మీకు నింపుగాన్॥

ఆ॥ వె॥ ఇంద్రుడిచ్చు మేలు వృద్ధశ్రవుడు విశ్వ। వేదు
డైన పూష విభుడు నల్ల। తానరిష్టనేమి తార్క్ష్యుం
డు మాకు బృ। హస్పతియును శుభదులగుదు రెలమి॥

(శాంతిశాంతిశాంతి.)

కం॥ కలవేలుపులకు మొదలై। కలిగెన్ విశ్వము సృజించి

---

# ముణ్డకోపనిషత్.

## శాన్తిః.

భద్రం కర్ణేభి శ్శృణుయామ దేవాః। భద్రం పశ్యే
మాక్షభి ర్యజత్రాః। స్థిరై రఙ్గై స్తుష్టువాగ్ సస్తనూభిః।
వ్యశేమ దేవ హితం యదాయుః। స్వస్తిన ఇన్ద్రో వృద్ధశ్ర
వాః। స్వస్తి నః పూషా విశ్వవేదాః। స్వస్తి న స్తార్క్ష్యో అ
రిష్ట నేమిః। స్వస్తి నో బృహస్పతి ర్దధాతు॥

(ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః.)

౧; బ్రహ్మా దేవానాం ప్రథమ స్సంబభూవ విశ్వస్యకర్తా

శాచు నలువ, వి। ద్యలకిరవగు పరవిద్యన్ । దొలి
సుతున కథర్వున కల దుగినుఁడు తెలిపెన్॥ ౧

తే॥గీ॥ బ్రహ్మపలికిన యాపరబ్రహ్మవిద్య । నాయథర్వుఁడు
శిష్యుఁడౌ నంగిరునకు । వరభారద్వాజకుల సత్యవా
హున కతఁ । డంగిరసునకు వరుసగా నతఁడు తె
లిపె ॥ ౨

వ॥ మహాశాలుండగు శౌనకుండు యథావిధిగా నుపసన్నుం
డై, ఓభగవంతా! ఎయ్యది తెలిసిన నీయఖిలంబుం దె
లియంబడునని యంగిరసు నడిగె(౩)- ఆతని కతం డి
ట్లనియె:- పరయునపరయు నని రెండు విద్యలు తెలి
యం దగునవియని బ్రహ్మవిదులు పలుకుదురు (౪)- అం
దు ఋగ్వేదంబును యజుర్వేదంబును సామవేదంబు

---

భువనస్య గోప్తా । సబ్రహ్మవిద్యాం సర్వవిద్యాప్రతిష్ఠా
మథర్వాయ జ్యేష్ఠపుత్రాయ ప్రాహ ॥

౨- అథర్వణే యాం ప్రవదేత బ్రహ్మాథర్వా తాం పురోవా
చాఙ్గిరే బ్రహ్మవిద్యామ్ । సభారద్వాజాయ సత్యవా
హాయ ప్రాహ భారద్వాజోఽఙ్గిరసే పరావరామ్ ॥

౩- శౌనకో హ వై మహాశాలోఽఙ్గిరసం విధివ దుపసన్నః
పప్రచ్ఛ । కస్మిన్నుభగవో విజ్ఞాతే సర్వమిదంవిజ్ఞాతం
భవతీతి ॥

౪- తస్మై స హోవాచ ॥ ద్వేవిద్యే వేదితవ్యే ఇతి హస్మ
యద్బ్రహ్మవిదో వదన్తి పరాచైవాపరాచ ॥

౫- తత్రాపరా ఋగ్వేదో యజుర్వేద స్సామవేదో ఽథ
ర్వవేద శ్శిక్షా కల్పో వ్యాకరణం నిరుక్తం ఛన్దోజ్యో

నథర్వవేదంబు శిక్షయుఁ గల్పము వ్యాకరణంబు నిరు
క్తము ఛందము జ్యోతిషంబునను నీది యపరవిద్య॥ ౩

చం॥ తెలియఁగ నెద్ది యక్షర మదృశ్య మసుగ్రహ మ
ట్లు వర్ణమున్ । గులమును గన్ను చెవ్వి యడుఁగున్ గ
యి లేకను వై విభుత్వమున్। బొలుపుగఁగాంచి నిత్య
మును భూతనిదాన మనాశ మెల్లెడన్। గల దది దేని
చే బుధులు కాంతు రదే పరవిద్య యెన్నఁగన్ (౪-౬)

కం॥ పర మపర మెవ్వనికి నణు । తరము మహత్తరము నిం
పాదవ ద్వైదియు, దివిన్।దిరముగఁ దరువనఁ గలఁడే
పురుషుఁ డొకఁడు వాని చేతఁ బూర్ణ మఖిలమున్ (౭)॥

తే.గీ॥ సాలెపురు వెట్లు సృజియించు సంగ్రహించుఁ । బుడ
మి నోషధు లెట్టులు పొడముచుండు । మనుజులవలనఁ
గేశలోమంబు లెట్లు । సంభవించు నట్లఖిల మక్షరుని
వలన (౮)॥

౬

---

తిషమితి అథ పరా యయా తదక్షర మధిగమ్యతే ॥

౬. యత్త దద్రేశ్య మగ్రాహ్య మగోత్ర మవర్ణ మచ
క్షుశ్శ్రోత్రం తదపాణిపాదమ్ । నిత్యం విభుం సర్వ
గతం సుసూక్ష్మం తదవ్యయం యద్భూతయోనిం పరి
పశ్యన్తి ధీరాః ॥

౭. యస్మాత్పరం నా పరమస్తి కించి ద్యస్మా న్నాణీయో
న జ్యాయోఽస్తి కశ్చిత్ । వృక్ష ఇవ స్తబ్ధో దివి తిష్ఠ
త్యేక స్తేనేదం పూర్ణం పురుషేణ సర్వమ్ ॥

౮. యథోర్ణనాభిః సృజతే గృహ్ణతే చ యథా పృథివ్యా
మోషధయః సమ్భవన్తి । యథా సతః పురుషా త్కేశ
లోమాని తథాక్షరా త్సంభవతీహ విశ్వమ్ ॥

ఆ॥ వె॥ తపముచేత బ్రహ్మ ముపచయమొందు బ్ర । హ్మమునం
బుట్టు నన్న మన్నమున నె । ప్రాణముం బ్రాణము మ
నమును సత్యమట్లు లో । కములు కర్మ హేతుక మమృ
తమును (౯)॥ ౭

తే॥గీ॥ జగతి సర్వజ్ఞుం డెవ్వండు సర్వవిదుండు । జ్ఞానమయతప
మ్మవారు నెవ్వానియందు । వానివలన నె కలుగునీ బ్రహ్మ
మట్లు । నామమును రూపములును నన్నంబుకూడ (౧౦)॥

---

వ॥ అయ్యది సత్యంబు ॥ ౧

తే॥గీ॥ కవులు కనిరి మంత్రముల నేకర్మములను । త్రేతలో
విస్తరిలె౯ బెక్కు తెఱంగుల నవి । సత్యకాముల మీర
వి సలుపుఁడు నియ । తముగ నిదె మీకు సుకృతప
థంబు జగతి (౧)॥ ౨

కం॥ చలియించు నెపుడు కీలలు । జ్వలితంబగు నగ్ని నపు
డు సలుపుఁడు హోమం । బుల నెల్ల నాజ్యభాగం॥

---

౯- తపసా చీయతే బ్రహ్మ తతోఽన్న మభిజాయతే ।
అన్నాత్ప్రాణో మనః సత్యం లోకాః కర్మసు చా
మృతమ్ ॥

౧౦- యస్సర్వజ్ఞః సర్వవిద్యస్య జ్ఞానమయం తపః । తస్మా
దేతద్బ్రహ్మ నామ రూప మన్నంచ జాయతే ॥

ఇతి ప్రథమముణ్డకే ప్రథమః ఖణ్డః.

౧- తదేతత్సత్యమ్ । మన్త్రేషు కర్మాణి కవయో యా
న్యపశ్యంస్తాని త్రేతాయాం బహుధా సన్తతాని । తా
న్యాచరథ నియతం సత్యకామా ఏష వః పన్థాస్సుకృ
తస్య లోకే ॥

౨- యదా లేలాయతే హ్యర్చిస్సమిద్ధే హవ్యవాహనే ।

బులమధ్యన్ మీరు, శ్రిద్ధపాదల హుత మగున్ (౨)॥ ౩

కం॥ ఇలలో నెవ్వని యగ్నిహోత్రమున నెంతే పూర్ణ
మాసంబుని । స్తుల దర్శనంబును వైశ్వదేవమును జా
తుర్మాస్యమున్ లేవు దు। ర్బలమా నాగ్రియణాతిథికి
య లనర్హంబో హుత్తం బట్టినాఁ । డలలోకంబుల
సప్తకంబున్నకుఁ దానహరుండు గాఁ జెప్పుడున్ (౩)॥

తే.గీ॥ క్రిమముతోడనె కాళి కరాళి యు న్న । నోజవ
సులోహిత యు నా వెనుక సుధూమ్ర । వర్ణ యు
స్ఫులిజ్గిని యు దేవి వహ్ని కేడు। రసనలు చలాచలం
బులై కాలుచుండు (౪)॥ ౫

తే.గీ॥ ద్యోతమానములయిన యీ హేతులందు । నాహుతు
ల నెవ్వఁ డొనరించు నవసరముల । నాతనిం జేర్చు
నివియె యరాఁకంశువులయి । యొక్కఁడా దేవతల

---

త దాజ్యభాగావన్తరేణాహుతీః ప్రతిపాదయే చ్ఛ్రిద్ధ
యా హుతమ్ ॥

౩. యస్యాగ్నిహోత్ర మదర్శ మపౌర్ణమాస మచాతు
ర్మాస్య మనాగ్రియణ మతిథివర్జితంచ । అహుత మ
వైశ్వదేవ మవిధినాహుత మాసప్తమాం స్తస్యలోకా
న్ హినస్తి ॥

౪. కాలీ కరాలీ చ మనోజవా చ సులోహితా యా చ
సుధూమ్రవర్ణా । స్ఫులిజ్గినీ విశ్వరూపీ చ దేవీ లే
లాయమానా ఇతి సప్తజిహ్వాః ॥

౫. ఏతేషు య శ్చరతే భ్రాజమానేషు యథాకాలం చా
హుతయో హ్యాదదాయన్ । తం నయ న్త్యేతా సూ
ర్యస్య రశ్మయో యత్ర దేవానాం పతి రేకో ౽

దేవుఁ డున్నచోటు(౫)॥ ౬

కం॥ రారమ్మని యజమానుని। నారవికరయుతిని నుజ్జ్వలాహుతులు ప్రియం। బౌరఁ బలికి పూజించుచు। నీ రందెడు పుణ్యలోక మిదియని చేర్చున్ (౬)॥ ౭

కం॥ ఇవి క్రతువులు పదునెనమం। డవి యవరక్రియము లు నదృఢప్లవములు, మే। లివి యని యెవ్వరు పొం గుదు, రవు వెండియు జరయు మృతియు నా మూ ఢులకున్ (౭)॥ ౮

తే॥గీ॥ పెక్కువార లవిద్యలోఁ జిక్కువడుచుఁ। దెలివిగలధీరుల మని భ్రాంతిని వహించి। తిరుగుచుందు రంధులఁ గూడి యరుగుచెంచు। నంధులంబోలె మూఢులై యందు నిందు (౮)॥ ౯

---

ధివాసః ॥

౬. ఏహ్యేహీతి త మాహుతయ స్సువర్చసః సూర్యస్య రశ్మిభి ర్యజమానం వహన్తి। ప్రియాం వాచ మభివద న్త్యో ఽర్చయన్త్య ఏష వః పుణ్య స్సుకృతో బ్రహ్మలోకః ॥

౭. ప్లవా హ్యేతేఅదృఢా యజ్ఞరూపా అష్టాదశోక్త మ వరం యేషు కర్మ। ఏతచ్ఛ్రేయో యే ఽభినన్దన్తి మూఢా జరామృత్యుం తే పున రేవాపియన్తి ॥

౮. అవిద్యాయా మన్తరే వర్తమానాః స్వయం ధీరాః ప ణ్డితంమన్యమానాః। జఙ్ఘన్యమానాః పరియన్తి మూఢా అన్ధేనైవ నీయమానా యథాన్ధాః ॥

కం॥ పలువిధముల బాలురు వ । ర్తిలుచు నవిద్యన్ దముఁ
గృతకృత్యుల మనుచున్ । దలఁతురు తెలియమి నా
క । ర్ములు జారుదు రార్తిని నిజపుణ్యము తఱుగ
న్ (౯)॥ ౧౦

కం॥ ఇష్టాపూర్తము మేలను । దుష్టమతుల కొండుమేలు
తోఁచదు మఱి వా । రిష్టఫలభుక్తి దివిఁ గని । కష్ట
ముగాఁ గాంతురీ జగంబు నధమమున్ ॥ (౧౦) ౧౧

క॥ శమమును దమమును శ్రద్ధయు । నమర బుధులు భై
క్షచర్య నడవి నిలుతుర । ర్యముత్రోవ విరజులై వార
మృతావ్యయపురుషపదము నందుదు రెలమిన్ (౧౧)॥

సీ॥ బ్రహ్మపాఠము చేసి ప్రబలినవాఁడు లోకము లెల్లఁ గ
ర్మచితములె యనుచుఁ । గృతము చేఁ గలుగ దకృత
మని పరికించి నిర్వేద మొంది దానిని దెలియఁగ । ను

---

౯. అవిద్యాయాం బహుధా వర్తమానా వయం కృతా
ర్థా ఇత్యభిమన్యన్తి బాలాః । యత్కర్మిణో న ప్రవే
దయన్తి రాగా త్తేనాతురాః క్షీణలోకా శ్చ్యవన్తే ॥

౧౦ ఇష్టాపూర్తం మన్యమానా వరిష్ఠం నాన్యచ్ఛ్రేయో
వేదయన్తే ప్రమూఢాః । నాకస్య పృష్ఠే తే సుకృతే
ఽనుభూత్వా ఇమం లోకం హీనతరం చావిశన్తి ॥

౧౧. తపశ్శ్రద్ధే యే హ్యుపవసన్త్యరణ్యే శాన్తా విద్వాంసో
భైక్షచర్యాం చరన్తః । సూర్యద్వారేణ తే విరజాః
ప్రయాన్తి యత్రామృత స్సపురుషో హ్యవ్యయాత్మా॥

౧౨. పరీక్ష్య లోకా న్కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేద
మాయా న్నాస్త్యకృతః కృతేన । తద్విజ్ఞానార్థం స
గురుమేవాభిగచ్ఛే త్సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మ

ద్యాస్తుఁడై శ్రోత్రియుని బ్రహ్మనిష్ఠుని గురుని సమిధలు
కైకొని చనుచుండెను। దగు(౧౨), యథావిధిగా నితం
డుపసన్నుఁడు శాంత చేతస్కుఁడు శమయుతుండు॥ న
ని విచారించి సత్యుఁడు నక్షరుండు। నైన పురుషుని
దేనిచే నగు నెఱుంగ। నట్టిదా బ్రహ్మవిద్య యథార్థరీ
తి। వెలయ నతఁ డుపదేశింపవలె నతనికి(౧౩)॥ ౧౨

---

వ॥ అయ్యది సత్యంబు- ౧

తే॥గీ॥ వేయి విధముల దీప్తుఁడౌ వీతిహోత్రు। వలన మి
ణుఁగుఱులు సరూపములు జనించు,। నట్లు వివిధముల్
భావము లక్షరునెడఁ। బొడము నో సోమ్య! యందు
నె యడఁగుచుండు(౧)॥ ౨

కం॥ పురుషుఁ డజుఁడు బాహ్యాభ్యం। తరుం డమూర్తుండు

---

నిష్ఠమ్॥

౧౩. తస్మై సవిద్వానుపసన్నాయ సమ్యక్ప్రశాన్తచిత్తాయ
శమాన్వితాయ। యేనాక్షరం పురుషం వేద సత్యం
ప్రోవాచ తాం తత్త్వతో బ్రహ్మవిద్యామ్॥

ఇతి ప్రథమముణ్డకే- ద్వితీయః ఖణ్డః.

ఇతి ప్రథమ ముణ్డకమ్-

౧. తదేతత్సత్యమ్। యథా సుదీప్తాత్పావకాద్విస్ఫులి
ఙ్గాః సహస్రశః ప్రభవన్తే సరూపాః,। తథాక్షరా
ద్వివిధాః సోమ్య భావాః ప్రజాయన్తే తత్ర చైవాపి
యన్తి॥

౨. దివ్యో హ్యమూర్తః పురుషః స బాహ్యాభ్యన్తరో

మఱి యతఁడు దివ్యుఁడు ప్రాణరహితుఁ డమ
నస్కుఁడు న। క్షరపరపరుఁ డట్ల తలఁపఁ జను శు
భ్రుండై (౨)॥ ౩

కం॥ జనియించుఁ బ్రాణ మితనివ। లన మనమిన్ద్రియములు
నఖిలములు నభము స్ప। ర్శనమును దేజము జలమును।
దనయందే విశ్వమెల్లఁ దాల్చు ధరణియున్ (౩)॥ ౪

కం॥ తల యగ్ని కన్ను లినచం।ద్రులు దిక్కులు చెవులు ప్రా
మినుకులు పలుకు గా। డ్పలప్రాణము జగమెద యడు।
గిల ,యితనికి, నంతరాత్మ యితఁడందఱికిన్ (౪)॥ ౫

తే॥గీ॥ ఇతనివలననె యగ్నియా నినసమిత్కుఁ, । డిందువు
వలనఁ బర్జన్యుఁ, డిలను నోష। ధులు, పొలతియం
దు వీర్యంబుచిలుకుపురుషుఁ,। డితనివలనఁ బ్రజలు పె
క్కుగతులఁ బుట్టు (౫)॥ ౬

---

హ్యజః। అప్రాణో హ్యమనా శ్శుభ్రో హ్యక్షరా
త్పరతః పరః ॥

౩. ఏతస్మాజ్జాయతే ప్రాణో మనస్సర్వేన్ద్రియాణి చ।
ఖం వాయుర్జ్యోతిరాపః పృథివీ విశ్వస్య ధారిణీ ॥

౪. అగ్నిర్మూర్ధా చక్షుషీ చన్ద్రసూర్యౌ దిశశ్శ్రోత్రే వాగ్వి
వృతాశ్చ వేదాః। వాయుః ప్రాణో హృదయం వి
శ్వమస్య పద్భ్యాం పృథివీ, హ్యేష సర్వభూతాన్త
రాత్మా ॥

౫. తస్మాదగ్నిస్సమిధో యస్య సూర్యః, సోమాత్పర్జన్య,
ఓషధయః పృథివ్యామ్,। పుమాన్ రేతస్సిఞ్చతి యోషి
తాయాం, బహ్వీః ప్రజాః పురుషాత్సంప్రసూతాః ॥

తే॥గీ॥ అవు నతనివలననె ఋగ్యజువులు సామ । ములు మ
ఖము లఖిలక్రితువులును దక్షి । ణలును నేఁడులు య
జమానుఁ డలరవీందు । వులవలన శుద్ధమగు లోకము
లుదితములు (౬)॥ ౭

తే॥గీ॥ పాడమి రతనివలననె వేల్పులు పలువిధ । ములుగ సా
ధ్యుల్ నరుల్ పశువులు పులుగులు । ప్రాణము న
పానమును వ్రీహి యవము తపము । శ్రిద్ధయును స
త్యమును బ్రిహ్మచర్యము విధి (౭)॥ ౮

కం॥ ప డతనివలనఁ బ్రాణము । లే డర్చులు పాడము స
మిధ లేడాహుతుల । శ్లేడు గుహానుండు ప్రాణము ।
తే డేడును నిహితము లగు నీలోకంబుల్ (౮)॥ ౯

తే॥గీ॥ ఇతనివలన జలధులు మహీధ్రిములును । గలుగు, న
న్నిరూపుల నిమ్నగలును బాఱు, । నోషధులు రసము
లును, లో నుండు నాత్మ । భూతజాత సమేతుఁడై

---

౬- తస్మా దృచ స్సామ యజూంషి దీక్షా యజ్ఞాశ్చ స
ర్వే క్రితవో దక్షిణాశ్చ । సంవత్సరంచ యజమాన
శ్చలోకాః సోమో యత్రి పవతే యత్రిసూర్యః ॥

౭- తస్మాచ్చదేవా బహుధా సంప్రిసూతాః సాధ్యా మ
నుష్యాః పశవో వయాంసి । ప్రాణాపానౌ వ్రీహి
యవౌ తపశ్చ శ్రిద్ధా సత్యం బ్రిహ్మచర్యం విధిశ్చ ॥

౮- సప్త ప్రాణాః ప్రిభవన్తి తస్మా త్సప్తార్చిష స్సమిధ
స్సప్తహోమాః । సప్త ఇమే లోకా యేషు చరన్తి
ప్రాణా గుహాశయా నిహితా స్సప్తసప్త ॥

౯- అత స్సముద్రా గిరయశ్చ సర్వే, అస్మా త్స్యన్దన్తే సిన్ధ
వ స్సర్వరూపాః,। అతశ్చ సర్వా ఓషధయో రసశ్చ,

పొలుచుఁ గాన (౯)॥ ౧౦

కం॥ కనుసర్వము పురుషుఁడె, తప। మును గర్మము నిందుబ్రి
హ్మము పరామృతమై। వినిహితము గుహానని యెఱుఁ
గు నతఁ డవిద్యముడి నూడ్చికొను సౌమ్యుండా (౧౦)॥

---

ఉ॥ జ్ఞానమునందు నిల్వుఁడిది, సన్నిహితంబు పదంబు హృ
ద్గుహా। స్థానచరంబు పెద్ద సదసత్తుల కంటె వరేణ్య
మట్లది। జ్ఞానముకన్న నెక్కుడు ప్రజావరణీయము
వెల్గు, జీవితం। బౌనది సుప్తముం జలము నా సకలం
బును దానిలోనిదే॥ ౧

మ॥ పదమా లోకుల కెద్ది లోకములకున్ భాస్వంతమై
యుండునె। య్యది సూక్ష్మంబుల కెల్ల సూక్ష్మమగుచున్
బ్రాణంబు వాకున్ మనం। బదియే యై మఱి య

---

యేనైవభూతైస్సిష్టతే వ్యాన్తరాత్మా॥

౧౦. పురుష ఏవేదం విశ్వం కర్మ తపో బ్రహ్మ పరామృత
మ్,। ఏతద్యో వేద నిహితం గుహాయాం సో విద్యా
గ్రన్థిం వికిరతీహ సోమ్య॥

ఇతి ద్వితీయముణ్డకే - ప్రథమఃఖణ్డః.

౧. ఆవిస్సన్నిహితం గుహాచరం నామ మహత్పద మత్రై
తత్సమర్పితమ్। ఏజ త్ప్రాణ న్నిమిషచ్చ యదేతజ్జా
నథ సదసద్వరేణ్యం పరం విజ్ఞానా ద్యద్వరిష్ఠం ప్ర
జానామ్॥

౨. యదర్చిమ ద్యదణుభ్యోఽణు యస్మిన్ లోకా నిహి
తా లోకినశ్చ। తదేతదక్షరంబ్రహ్మ సప్రాణస్తదు వా

క్షరంబైన బ్రహ్మంబై యదే సత్యమహా । నదియే సుక్ష్మ
మృతంబు వేధ్య మదె సోమ్యా! నిల్పు మందె మదిన్॥

తే॥గీ॥ ఔపనిషద మహాస్త్రి శరాసము గొని । శర మపా
సాశితము చేర్చి శాన్త†భాగ। వతమయిన మానసము
న నాయతత సోమ్య! । త్తగియ నా యక్షరమె లక్ష్య
మగుఁ, దెలియుము ॥ క్షే

తే॥గీ॥ ప్రణవము శరాసనంబు రోప మగు నాత్మ। బ్రహ్మమే
లక్ష్యమనుచుఁ జెప్పంబడఁదగు । నప్రమాదంబుతో
డ సేయంగ వలయు।నమ్మురీతినిదన్మయత్వమ్ముఁగాంచు॥

కం॥ ఓతము భువి దివి యమరని । కేతన మెందు న్మనంబ
ఖిలము లసువులా । చేతను నే తెలియుఁడమృత। సే
తు వతఁడు విడువుఁడొండు చేరిన వాక్కుల్ ॥

---

ఙ్మనః। తదేతత్సత్యం తదమృతం తద్వేద్ధవ్యం సోమ్య
విద్ధి ॥

౩. ధను ర్గృహీ త్వౌపనిషదం మహాస్త్రం శరం హ్యుపా
సానిశితం సన్ధీయత । ఆయమ్య త*ద్భాగవతేన చేత
సా లక్ష్యం తదేవాక్షరం సోమ్య విద్ధి ॥

౪. ప్రణవో ధనుశ్శరో హ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్య ముచ్యతే ।
అప్రమత్తేన వేద్ధవ్యం శరవత్తన్మయో భవేత్ ॥

౫. యస్మిన్ ద్యౌః పృథివీ చాన్తరిక్ష మోతం మనస్సహ
ప్రాణైశ్చ సర్వైః। తమేవైకం జానథాత్మాన మన్యా
వాచో విముఞ్చథ, అమృతస్యైష సేతుః ॥

---

†భాగ।వతము=భావ।గతము *భాగవతేన=భావగతేన, అనిపాఠాంతరము.

చం॥ అరకమునాభిలో నరములట్టుల సంహతిఁ జెంది యెందు నే । నరములు గూడు నానడుమునన్ బహురీతుల జాతుఁడౌచు సం । చరణము చేయు నాత్మ, యల యాత్మనె యోమని మీతమంబు న । ద్దరికన లోఁద లంపుఁడు పదంపడి, భవ్యము మీకుఁ గావుత॥ ౬

కం॥ భువి గల మహిమము లెల్లన్ । స్వవశము లెవ్వని క తండు సర్వజ్ఞుఁడు స । ర్వవిదుండు బ్రహ్మపురమున। దివి దివ్యమునందు నాత్మ తిరముగ నుండున్ ॥ ౭

తే॥గీ॥ మానసమయుండు కలఁ డన్నమయమునందు । హృదయమందునె ప్రాణశరీరనేత । యమృతు నానందమై తోఁచు నతని ధీర।జనులు కనుఁగొందు రెపుడు విజ్ఞానమునను ౮

ఆ॥వె॥ హృదయమందు గ్రంథి విదళితమై పోవు । సందియంబు లెల్లఁ జయ్యనఁ డెగు । క్షయముఁ గాంచు నితని కర్మంబు లాపరా। వరుని దర్శనంబు వరలు నపుడె॥

---

౬. అరాఇవ రథనాభౌ సంహతా యత్రనాడ్యః సఏషో ఽన్తశ్చరతే బహుధా జాయమానః।ఓమిత్యేవం ధ్యాయథాత్మానం స్వస్తివః పారాయ తమసః పరస్తాత్॥

౭. యస్సర్వజ్ఞ స్సర్వవి ద్యస్యైష మహిమా భువి । దివ్యే బ్రహ్మపురే హ్యేష వ్యోమన్యాత్మా ప్రతిష్ఠితః ॥

౮. మనోమయః ప్రాణశరీరనేతా ప్రతిష్ఠితోఽన్నే హృదయం సన్నిధాయ । తద్విజ్ఞానేన పరిపశ్యన్తి ధీరా ఆనన్దరూప మమృతం యద్విభాతి ॥

౯. భిద్యతే హృదయగ్రన్థి శ్ఛిద్యన్తే సర్వ సంశయాః। క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే ॥

క॥ అమరు హిరణ్మయ పర కో । శమున న్నిష్కలమగు
విరజము బ్రహ్మము త । త్త్వము నెఱుఁగువారి కది జ్ఞే
యము జ్యోతిర్జ్యోతిమైన యాశుభ్ర మగున్ ॥ ౧౦

తే॥గీ॥ ఆతని వెలుంగు పై వెల్గఁ డర్కుఁ డట్ల । యిందువు
ను రిక్కలు మెఱుంగు, లెట్టులగ్ని?, । వాని వెలుఁ
గు వెంబడినె సర్వము వెలుంగు,। వాని వెలుఁగున
వెలుఁగు సర్వంబు లివ్వి ॥ ౧౧

క॥ మన కెదుట వెనుక మఱియిద । కిణ నమున నుత్తరమునం
దుఁ గ్రిందన్ మీదన్ । గనుపట్టెడు నీవిశ్వం । బు న
మృతమా బ్రహ్మము వరముఖ్యఁబె యగున్ ॥ ౧౨

---

క॥ కల వొకతరువున బలురె। కల విపులువు లొకట రూ

---

౧౦. హిరణ్మయే పరే కోశే విరజం బ్రహ్మనిష్కలమ్। తచ్ఛు
భ్రం జ్యోతిషాంజ్యోతి స్తద్యదాత్మవిదో విదుః ॥

౧౧. నతత్రసూర్యో భాతి, నచన్ద్రతారకం, నేమావిద్యుతో
భాన్తి, కుతోఽయమగ్నిః, । తమేవ భాన్త మనుభాతి
సర్వం, తస్యభాసా సర్వమిదం విభాతి ॥

౧౨. బ్రహ్మైవేద మమృతం పురస్తా ద్బ్రహ్మ పశ్చా ద్బ్రహ్మ
దక్షిణత శ్చోత్తరేణ । అధశ్చోర్ధ్వంచ ప్రసృతం బ్ర
హ్మైవేదం విశ్వమిదం వరిష్ఠమ్ ॥

ఇతి ద్వితీయముణ్డకే-ద్వితీయఃఖణ్డః.

ఇతి ద్వితీయ ముణ్డకమ్-

౧. ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానంవృక్షం ప
రిషస్వజాతే, । తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్య

పుకలవి చెలిమితోఁ। గలియుచు రెం,డొకఁ డింపౌ।
ఫలముఁ దినుం, దినక యొండు భాసిలు నెలమిన్ ॥ ౧

తే॥గీ॥ పురుషుఁడు సమానమగు వృక్షమున నిమగ్నుఁ। డైయ
నీశభావమున మోహమునఁ బొగలుఁ, । జూచు నె
ప్పుడు సుమహిము జుష్టు నన్య। నీశు నిట్లుండు నని
శోక మెడలు నపుడు ॥ ౨

తే॥గీ॥ రుక్మవర్ణుని కర్త న్పురుషుని నీశు। బ్రహ్మయోనిని గ
నుఁగొనుఁ బశ్యుఁ డెప్పు। డపుడె విద్వాంసుఁ డూడ్చి
పుణ్యమును బాప। మును నిరంజనత సుసామ్యమును
భజించు ॥ ౩

తే॥గీ॥ ప్రాణుఁ డఖిలభూతములతో భాసిలు నని। పలుక
ననతివాది, యిట్టులఁ దెలియువాఁడు। క్రియలు కల
యితఁ డాత్మసంక్రీడుఁ డాత్మ। రతియు నై బ్రహ్మవిదు
లలో నతిశయిల్లుఁడు॥ ౪

---

నశ్నన్నన్యో అభిచాకశీతి ॥

౨. సమానే వృక్షే పురుషో నిమగ్నో అనీశయా శోచతి
ముహ్యమానః, । జుష్టం యదా పశ్యత్యన్య మీశ మస్య
మహిమాన మితి వీతశోకః ॥

౩. యదా పశ్యః పశ్యతే రుక్మవర్ణం కర్తారమీశంపురుషం
బ్రహ్మయోనిమ్ । తదా విద్వాన్ పుణ్యపాపే విధూ
య నిరఞ్జనః పరమం సామ్య ముపైతి॥

౪. ప్రాణో హ్యేష యస్సర్వభూతై ర్విభాతి విజానన్ వి
ద్వాన్ భవతే నాతివాదీ। ఆత్మక్రీడ ఆత్మరతిః క్రియా
వా నేష బ్రహ్మవిదాం వరిష్ఠః॥

తే॥గీ॥ సత్యమునఁదపమున బ్రహ్మచర్యనియతి । నుత్తమ జ్ఞానమునను లభ్యుఁడితఁడాత్మ,। తనువులోపల జ్యోతిరాత్మకుఁడు శుచియు,। దగ్ధదోషులు కాంతు రీతని నే యతులు ॥ ౫

తే॥గీ॥ సత్యము జయించు, గెలువ దసత్య మట్లు,। సత్యపరమనిధి వసించు స్థానము బుధు। లాప్తకాములు వైకోన నరుగు వితత। సరణి దేవయానము కల్గు సత్యము ననె ॥ ౬

తే॥గీ॥ అధి యచింత్యరూపంబు దివ్యంబు పెద్ద। సూక్ష్మములకంటెఁజూడఁగ సూక్ష్మతరము। దూరములకంటె దూరము చేరువ యగు। నిండె నిహితము గుహయందు నిది కనుఁగొన ॥ ౭

తే॥గీ॥ కన్ను వాకును నీతనిఁ గానలేవు। తదితరేంద్రియములు నట్ల తపము క్రియయు,। జ్ఞానము ప్రసన్న మగున

---

౫. సత్యేన లభ్య స్తపసా హ్యేష ఆత్మా సమ్యగ్జ్ఞానేన బ్రహ్మచర్యేణ నిత్యమ్ । అన్తశ్శరీరే జ్యోతిర్మయో హి శుభ్రో యం పశ్యన్తి యతయః క్షీణదోషాః ॥

౬. సత్యమేవ జయతే నానృతం సత్యేన పన్థా వితతో దేవయానః । యేనాక్రమ న్త్యృషయో హ్యాప్తకామా యత్ర తత్సత్యస్య పరమం నిధానమ్ ॥

౭. బృహచ్చ తద్దివ్య మచిన్త్యరూపం సూక్ష్మాచ్చ తత్సూక్ష్మతరం విభాతి । దూరాత్సుదూరే తదిహాన్తికే చ పశ్యత్స్విహైవ నిహితం గుహాయామ్ ॥

౮. నచక్షుషా గృహ్యతే నాపి వాచా నాన్యై ర్దేవై స్తపసా

ప్పై సత్త్వశుద్ధి। ధ్యానమున నిష్కళుఁ డితండు కాన
వచ్చు ॥ ౮

తే॥గీ॥ అణువు చిత్తంబుననె వేద్యుఁ డాత్మ యితఁడు,। సన్ని
విష్టంబు ప్రాణపంచకము నిండె,। విమలమై యెద్ది
యాత్మకు విభుత నిచ్చు। నుల్ల మది ప్రాణములతో
డ నోత మిండె ॥ ౯

తే॥గీ॥ లోక మెది యెది చిత్తములోఁ దలంచు। కాంక్ష ని
డు శుద్ధసత్త్వుఁ డేకామములను। గామలోకము లతఁ
డవి కాంచుఁ గాన। భూతికాముఁడు కాత్మజ్ఞపూజ
వలయు ॥ ౧౦

---

తే॥గీ॥ వెలుఁగు శుభ్రంబుగా నెందు నిలువ విశ్వ। మాపరబ్ర
హ్మ ధామంబు నతఁ డెఱుంగు,। వీతకామత నతని సే

---

సా కర్మణా వా। జ్ఞానప్రసాదేన విశుద్ధసత్త్వ స్తతస్తు
తం పశ్యతే నిష్కలం ధ్యాయమానః ॥

౯. ఏషోఽణురాత్మా చేతసా వేదితవ్యో యస్మిన్ ప్రా
ణః పఞ్చధా సంవివేశ,। ప్రాణైశ్చిత్తం సర్వమోతం ప్ర
జానాం యస్మిన్ విశుద్ధే విభవత్యేష ఆత్మా ॥

౧౦. యం యం లోకం మనసా సంవిభాతి విశుద్ధసత్త్వః కా
మయతే యాంశ్చ కామాన్। తం తం లోకం జయతే
తాంశ్చ కామాం, స్తస్మాదాత్మజ్ఞం హ్యర్చయేద్భూతి
కామః ॥

ఇతి తృతీయముణ్డకే- ప్రథమః ఖణ్డః.

౧. స వేదైతత్పరమం బ్రహ్మధామ యత్ర విశ్వం నిహితం
భాతి శుభ్రమ్,। ఉపాసతే పురుషం యే హ్యకామా

పించు నట్టి । వారు గడతు రీశుక్రము ధీరజనులు ॥ ౧

తే॥గీ॥ ఈప్సితములఁ దలఁచి కోరు నెవ్వఁ డిందు । నతఁడు జనియించు వానితో నచటచట నె,। యాప్తకాముఁ గృతకృత్యుఁ డైనవాని । కన్ని కామము లిందునె య డఁగి పోవు ॥ ౨

కం॥ కొనరాఁ డాత్మ ప్రవచనం । బున నైనన్ మేధనైన భూరియగుశ్రుతం । బున, నాతఁడెవని వరియిం । చునో యతనికె సులభుఁ డగుచుఁ జూపును దన్నన్ ॥ ౩

కం॥ సులభుం డీయాత్మ తపో । బలలింగావహితతలను బలి మిఁగనక యె । ట్టుల, నీసాధనములచేఁ । దలపడు నరునాత్మ బ్రహ్మధామముఁ జొచ్చున్ ॥ ౪

తే॥గీ॥ ఈతనిని జ్ఞానతృప్తులౌ ఋషులు కాంచి । వీతరాగులు శాంతులు కృతులు నగుచు । ధీరు లఖిలగు నెల్లెడఁ దె

---

స్తే శుక్రమేత దతివర్తన్తి ధీరాః ॥

౨. కామాన్ యః కామయతే మన్యమానః స కామభి ర్జాయతే తత్రతత్ర,। పర్యాప్తకామస్య కృతాత్మ నస్తు ఇహైవ సర్వే ప్రవిలీయన్తి కామాః ॥

౩. నాయమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన । యమేవైషవృణుతే తేన లభ్య స్తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్ ॥

౪. నాయమాత్మా బలహీనేన లభ్యో నచ ప్రమాదాత్తప సో వాప్యలిఙ్గాత్ । ఏతై రుపాయై ర్యతతే య స్తు విద్వాం స్తస్యైష ఆత్మా విశతే బ్రహ్మధామ ॥

౫. సంప్రాప్యైన మృషయో జ్ఞానతృప్తాః కృతాత్మా నో వీతరాగాః ప్రశాన్తాః। తే సర్వగం సర్వతః ప్రా

లేవి నొంది। యఖిలములఁ జేరఁ గలరు యుక్తాత్ముల
గుచు ॥ ౫

మ॥ వితతా సంకర సత్త్వ సంకలితులై వేదాంతవిజ్ఞానని।
శ్చిత నర్థంబుల నన్నిటిం దెలియుచున్ సన్న్యాసయోగ
స్థితిన్ । యతులై యొప్పుచు నున్నవారలు పరాంత
ప్రాప్తివేళన్ బరా। మృతు లౌచున్ బరిముక్తులై
పొలుతు రెంతే బ్రహ్మలోకంబులన్ ॥ ౬

కం॥ కళలు పదియేను ప్రకృతి। ప్రళయము కను, దేవగ
ణము ప్రతిదేవతలన్। బొలయు, విజ్ఞానమయుం।
డలకర్మములున్ బరావ్యయైక్యము గాంచున్ ॥ ౭

కం॥ సరవిన్ బాఱు నదులు సా। గరమునఁ జ్యుతనామ
రూపకతఁ జెందెడు, నా। కరణి నవి విడిచి విబు
ధుఁడు। పరునకుఁ బరుఁడైన దివ్యుఁ బడయుఁ బురు
షునిన్ ॥ ౮

సీ॥ ఈ పరమ బ్రహ్మ మెఱిఁగినవాఁడు బ్రహ్మంబె యౌ,

---

ప్య ధీరా యుక్తాత్మాన స్సర్వమే వావిశన్తి ॥

౬. వేదాన్తవిజ్ఞానసునిశ్చితార్థా స్సన్న్యాసయోగాద్యత
య శ్శుద్ధసత్త్వాః। తే బ్రహ్మలోకేషు పరాన్తకాలే
పరామృతాః పరిముచ్యన్తి సర్వే ॥

౭. గతాః కలాః పఞ్చదశ ప్రతిష్ఠా దేవాశ్చ సర్వే ప్రతి
దేవతాసు। కర్మాణి విజ్ఞానమయశ్చ ఆత్మాపరే ఽవ్య
యే సర్వ ఏకీభవన్తి ॥

౮. యథా నద్య స్స్యన్దమానా స్సముద్రే ఽస్తం గచ్ఛన్తి
నామరూపే విహాయ। తథా విద్వాన్నామరూపా
ద్విముక్తః పరాత్పరం పురుష ముపైతి దివ్యమ్ ॥

౯. స యో హ వై తత్పరమం బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి,

వాని కులంబు నందు । బ్రహ్మవిదన్యుఁ డుత్పన్నుఁడు కాఁడు, తరించు శోకంబు దురితమును గుహా। యంద లి ముడి వీడి యమృతుఁడౌ, (౯) బ్రహ్మనిష్ఠులు క్రి యల్ కల శ్రోత్రియు లయి శ్రద్ధ। తామెవ్వ రేకర్షి హోమంబు చేసి విహితము తప్పక శిరోవ్రతము సేతు ॥ రర్షులీ బ్రహ్మవిద్యను నట్టివారె, । యిదియె శ్రుతి తెల్పె, (౧౦) నంగిరఋషియు మున్న। వ్రతము సేయక యిది చదువం దగద నె,। ఋతము, పరమర్షుల కు నమస్కృతి పలుమరు(౧౧)॥ ౯

ఇది మహోపాధ్యాయ శ్రీపరవస్తు
వేంకట రంగనాథాచార్యార్య వరగురు
కృతులలో నాంధ్రముండకోపనిషత్తు.

---

నాస్యాబ్రహ్మవిత్కులే భవతి,। తరతి శోకం తరతి పాప్మానం, గుహాగ్రన్థిభ్యో విముక్తో ఽమృతో భవతి॥

౧౦. తదేతదృచాభ్యుక్తమ్ - క్రియావన్త శ్శ్రోత్రియా బ్రహ్మనిష్ఠా స్స్వయం జుహ్వత ఏకర్షిం శ్రద్ధయన్తః। తేషామే వైతాం బ్రహ్మ విద్యాం వదేత శిరోవ్రతం విధివద్యైస్తు చీర్ణమ్ ॥

౧౧. తదేత త్సత్య మృషిరఙ్గిరాః పురో వాచ నైత దచీర్ణవ్రతో ఽధీతే,। నమః పరమర్షిభ్యో నమః పరమర్షిభ్యః ॥

ఇతి తృతీయముణ్డకే- ద్వితీయఃఖణ్డః.

ఇతి తృతీయ ముణ్డకమ్.

ముణ్డకోపనిషత్సమాప్తా.

# ఆంధ్రమాండూక్యోపనిషత్తు.

శాంతి.

ఉ॥ విందుముగాత మా చెవుల వేలుపులార శుభంబు లెప్పు
డున్। గందుముగాత భద్రములె కన్నుల నోయజనీ
యులార మె। పుష్టిం దిరమైన యంగముల పోడిమి మి
మ్ము నుతించు వారమై। యుందుము గాత నాయు వి
రవొందఁగ మేనుల మీకు నింపుగాన్॥

ఆ॥వె॥ ఇంద్రుఁడిచ్చు మేలు వృద్ధశ్రవుఁడు విశ్వ। వేదుఁడై
న పూషవిభుఁడు నట్లు। తా నరిష్టనేమి తార్క్ష్యుం
డు మాకు బృహస్పతియును శుభదు లగుదు రెలమి॥

(శాంతిశాంతిశాంతి.)

కం॥ ఓ మను నక్షరమే మన। మేమి తలంతు మదియట్ల

---

# మాణ్డూక్యోపనిషత్.

శాన్తిః.

భద్రం కర్ణేభి శ్శృణుయామ దేవాః। భద్రం పశ్యే
మాక్షభి ర్యజత్రాః। స్థిరైరఙ్గైస్తుష్టువాగ్ం స స్తనూభిః। వ్యశే
మ దేవ హితం యదాయుః। స్వస్తిన ఇన్ద్రో వృద్ధశ్రవాః।
స్వస్తి నః పూషా విశ్వవేదాః। స్వస్తి న స్తార్క్ష్యో అరిష్ట నే
మిః। స్వస్తి నో బృహస్పతి ర్దధాతు॥

( ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః.)

౧: ఓమిత్యేత దక్షరమిదగ్ం సర్వం తస్యోప వ్యాఖ్యానం

తీతము భవదా । గాము లని చెప్పఁబడియెడి । నా
మూడును వివరణము తదక్షరమునకున్ ॥ ౧

తే॥గీ॥ ఇదియుఁ గాక కాలత్రయాతీత మెద్ది । యదియు
నోంకారమే యయి యమరుచుండు(౧)। నఖిలమును
బ్రహ్మమగుట నీయాత్మ బ్రహ్మ। మమరు నయ్యది నా
ల్గుపాదములదగుచు (౨)॥ ౨

---

సీ॥ జాగరితముతనస్థానంబుగాఁగ బాహ్యప్రజ్ఞుఁ డతఁడు
సప్తాంగుఁ డరయఁ । బందొమ్మిది ముఖంబులం దగు
స్థూలాశనుం డయి వైశ్వానరుం డనఁబడుఁ,। బ్రథమ
పాదమిది(౧), స్వప్నస్థానుఁ డాంతర ప్రజ్ఞుఁడౌనం
గవక్త్రములునట్ల। పొలుపారఁ బ్రవివిక్త భుక్కు తైజ
సుఁ, డిదీ రెండవపాద(౨), మెం దుండి నిద్రఁ॥ గాం
చు లేక స్వప్నంబులు కానఁ, డది సు। షుప్తమగు

---

భూతం భవ ద్భవిష్యదితి సర్వమోఙ్కార ఏవ। యచ్చా
న్యత్త్రికాలాతీతం తద ప్యోఙ్కార ఏవ ॥
౨- సర్వగ్ం హ్యేతద్బ్రహ్మాయ మాత్మా బ్రహ్మ సోఽయమా
త్మా చతుష్పాత్ ॥

ఇతి ప్రథమః ఖణ్డః.

౧- జాగరితస్థానో బహిఃప్రజ్ఞః సప్తాఙ్గ ఏకోనవింశతిము
ఖఃస్థూలభుగ్వైశ్వానరః ప్రథమః పాదః ॥
౨- స్వప్నస్థానోఽన్తః ప్రజ్ఞః సప్తాఙ్గ ఏకోనవింశతిముఖః
ప్రవివిక్తభుక్తైజసో ద్వితీయః పాదః ॥
౩- యత్ర సుప్తో న కంచన కామం కామయతే నకంచన స్వ
ప్నంపశ్యతి తత్సుషుప్తమ్। సుషుప్తస్థాన ఏకీభూతః

నందుఁ జేతఃఅన్యుం డొకఁడయి। జ్ఞానఘనుఁ డగుప్రా
జ్ఞుఁ డానందభుజుఁ। తన్మయుండు తృతీయపాద
మగుచుండు (౩)॥ 3

సీ॥ ఇతఁడు సర్వేశ్వరుం డితఁడు సర్వజ్ఞుఁ డంతర్యామి
సర్వనిదాన మఖిల। భూతంబులకును బ్రభూత్యప్య
యములగు (౪) నంత ర్బహిః ప్రజ్ఞుఁ డట్లు రెండు।
ప్రజ్ఞలవాఁడును బ్రజ్ఞానఘనుఁడును నప్రజ్ఞుఁడును బ్ర
జ్ఞుఁ డనఁగఁబడక। దృష్ట చింత్య వ్యపదేశ్యముల్ వ్య
వహార్యమును గ్రాహ్యమును లక్ష్యము ననఁబడక॥ య
మరు నేకాత్మతా ప్రత్యయంబె సార। మయి ప్ర
పంచోపశమ రూపమయి శివంబు। నగుచు నద్వైత
మును శాంతమగు చతుర్థ। మైన పాదము, నాత్మ జ్ఞే
యంబునదియె(౫)॥ ౪

---

ప్రజ్ఞానఘన ఏవానన్దమయో హ్యానన్దభు క్చేతోముఖః ప్రాజ్ఞ స్తృతీయః పాదః॥

౪. ఏష సర్వేశ్వర ఏష సర్వజ్ఞ ఏషో౽న్తర్యా మ్యేష యోనిస్సర్వస్య ప్రభవాప్యయౌ హి భూతానామ్॥

౫. నాన్తః ప్రజ్ఞం నబహిఃప్రజ్ఞం నోభయతఃప్రజ్ఞం ప్రజ్ఞానఘనం నప్రజ్ఞం నాప్రజ్ఞమ్ అదృష్ట మవ్యవహార్యమ గ్రాహ్య మలక్షణ మచిన్త్య మవ్యపదేశ్య మైకాత్మ్యప్రత్యయసారం ప్రపఞ్చోపశమం శాన్తం శివమ ద్వైతం చతుర్థం మన్యన్తే స ఆత్మా సవిజ్ఞేయః॥

ఇతి ద్వితీయఃఖణ్డః.

సీ॥ అయ్యది యాత్మ యధ్యక్షర మోంకార మధిమాత్ర
మందు మాత్రాత్మకములు। పాదములవి యాత్మ పాదము లవి యకారము నుకారము మకారమును (౧),
మఱియు। జాగరితపద వైశ్వానరుఁ డానకారము
ప్రథమమగు మాత్ర యగుచుండు। నాప్తిమత్త్వంబున
నాదిమత్త్వంబున నాప్త్యాదితలు తద్జ్ఞుడందు ఫలము
(౨)॥ స్వప్నపదుఁ డుకారంబు తైజసుఁడు రెండ।
వదదియాత్కర్షమున నుభయతను దద్జ్ఞుఁ। డందు
నుత్కర్ష సమతల నతనిద్రైన। కులమునం బుట్టఁ డబ్రహ్మ కోవిదుండు (3)॥ x

మ॥ అవుఁ బ్రాజ్ఞుండు సుషుప్తసంస్థుఁడు మకారార్థం, బదేమాత్ర మూ। డవదా, నప్యయమాన హేతువది యాటన్ దద్జ్ఞలభ్యంబు లౌ। నవియే, (౪)

---

౧. సోఽయ మాత్మా ధ్యక్షర మోఙ్కారో ఽధిమాత్రం పాదా మాత్రా మాత్రాశ్చ పాదా అకార ఉకారో మకార ఇతి॥

౨. జాగరితస్థానో వైశ్వానరో ఽకారః ప్రథమా మాత్రా ఆప్తేరాదిమత్త్వాద్వా ఆప్నోతిహ వై సర్వాన్ కామా నాదిశ్చ భవతి యఏవం వేద॥

3. స్వప్నస్థానస్తైజస ఉకారో ద్వితీయా మాత్రోత్కర్షా దుభయత్వాద్వా ఉత్కర్షతి హవై జ్ఞానసన్తతిం సమానశ్చభవతినాస్యాబ్రహ్మవిత్కులే భవతి య ఏవం వేద॥

౪. సుషుప్తస్థానః ప్రాజ్ఞో మకార స్తృతీయా మాత్రా మితేరపీతేర్వా మినోతిహ వా ఇదగ్ సర్వ మపీతిశ్చ భవతి యఏవంవేద॥

తుర్యోఽమాత్రోఽసౌ ప్రణవ మా న ద్వైత విశ్వా
ప్యయః । వ్యవహార్యాత్మ శివుం చ, తద్విదుఃశు తా
నాత్మాప్తి నాత్మం గమన్ (౧)॥

ఇతిమహామహోపాధ్యాయశ్రీపరవస్తు
వేంకటరంగనాథాచార్యార్యవరగురు కృతు
లలోనాంధ్రమాండూక్యోపనిషత్తు.

---

౧. అమాత్రశ్చతుర్థోఽవ్యవహార్యః ప్రపఞ్చోపశమః శివోఽద్వైత ఏవమోఙ్కార ఆత్మైవ సంవిశత్యాత్మనాత్మానం య ఏవం వేద య ఏవం వేద ॥

ఇతి చతుర్థః ఖణ్డః.

ఇతి మాణ్డూక్యోపనిషత్ సమాప్తా.



నమఃపరమర్షిభ్యః.

# ఆంధ్రోపనిషత్తులు.

(తైత్తిరీయము- పురుషసూక్త సహితము)

ఇవి

మహామహోపాధ్యాయ శ్రీపరవస్తు
భగవద్వేంకటరంగనాథాచార్యులయ్యవారలుఁగారిచే
రచియింపఁబడినవి.

వీని గీర్వాణోపనిషత్తులంగూడఁ జేర్చి
విశాఖపట్టణమునందలి యార్షముద్రాశాలయందు
ముద్రింపఁబడి ప్రకటింపఁబడినవి.

Published by S. P. V. Ranganathasvami
Ayyavaralugaru,
Printed by R. Appalanarasimham,
at the Arsha Press, Vizagapatam.
1902.
Price 8 Annas.

# పీఠిక.

---

ఈ తైత్తిరీయోపనిషత్తు ఆంధ్ర- కర్నాట- ద్రవిడాది దేశములయందెల్ల అనువాకాది విభాగమున పరస్పరము భేదముకలదియై యనుసంధింపఁబడుచున్నది-

దీనికి భట్టభాస్కర- శఙ్కర- సాయణాచార్య- గోవిందరాజ- రంగరామానుజాదులనేకులు భాష్యములంజేసిరి-

శంకరాచార్యులవారు శిక్షా- బ్రహ్మ- భృగువల్లులకు మాత్రమే భాష్యమును రచియించి మిగిలినది ఖిలమనివిడచిపెట్టినట్లు కానవచ్చుచున్నది-

భట్టభాస్కర- సాయణ- గోవిందరాజుల భాష్యములు మూఁడును తరుచుగ ఒకటేమోస్తరైన యనువాకాది విభాగములకలవియేయై యున్నవి- వీరిపాఠము ద్రవిడపాఠము అని యాక్రింది సాయణాచార్య వాక్యమువలనస్పష్టము— "తత్ర ద్రావిడానాం చతుష్షష్ట్యనువాకపాఠః ... తత్రవయం పాఠాన్తరాణి సూచయన్ చతుష్షష్ట్యనువాకపాఠప్రాధాన్యేన వ్యాఖ్యాస్యామః" అని నారాయణవ్యాఖ్యానారంభమున భాష్యవాక్యము-

రంగరామానుజులును ద్రవిడపాఠానుసారులే కాని యేమికారణముననో పైముగ్గురి భాష్యకారుల యనువాకముల విభాగమునకును వీరి యనువాకముల విభాగమునకును చాలా భేదము కానవచ్చుచున్నది- వీరి యనువాకసంఖ్య ౫౨ గ మెడ్రాసులో ముద్రించిన పుస్తకమున స్పష్టము- దీనికారణము మృగ్యము-

ఇట్లు భాష్యకారులందరును ద్రవిడపాఠము నేయనుసరించి వ్యాఖ్యానము చేయుటవలన శ్రీ స్వామివారును ఆపాఠము

ననుసరించియె ఈయాంధ్రోపనిషత్తును రచియించిరి-

ద్రమిడపాఠమున నీయుపనిషత్తు శీక్షావల్లీ- బ్రహ్మావల్లీ- భృగువల్లీ- నారాయణములను నాలుగు పేరులను, సాంహితీ- వారుణీ- యాజ్ఞికీయని మూడుపేరులను కలిగియుండె; శీక్షా- బ్రహ్మ- భృగువల్లులు మూడునొక ప్రపాఠకముగాను నారాయణముమాత్రము మఱియొకప్రపాఠకముగాను విభజింపఁబడియున్నది- ప్రపాఠకమందను వాకములు వానిలో ఖండములు మొదలగు భేదములను కలిగియున్నది- అదియంతయు నీగ్రంథమున నాయాస్థలములలో తెలియఁజేయఁబడియున్నది-

మైసూరులో ముద్రించిన ద్రమిడపాఠమున కొన్నికొన్నిచోట్ల గ్రంథనాశము కలిగియున్నది- అదియంతయు శక్యమైనవరకు భాష్యములననుసరించి యిందుపరిహరింపఁబడినది-

ఇందుముద్రకదోషమునగాని తదనవధాననిబంధనమదీయ దోషంబునంగాని సంభవించిన దోషంబుల దోషజ్ఞులుదిద్ది నాకెరింగింతురని నమ్ముచున్నాను-

ఇట్లు ప్రకాశకవిజ్ఞాపనము.



